కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-51 జులై 2012

**మూలం: http://kottapalli.in/2012/07/welcome**

**మొత్తం ప్రతుల సంఖ్య:** 2000

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'వాన':** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

**వెల:రూ.20/-**

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

**ఫోను: 08559 240222, 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in**




# విషయ సూచిక

# ఓటమి-గెలుపు

రాము, రవి మంచి స్నేహితులు. సీను, రమణ కూడా మంచి స్నేహితులే.

రాము-రవి ఇద్దరూ కలిసి చదువుతారు; కలిసి ఆడతారు; ఒకరికొకరు సాయం చేసుకుంటారు.

సీను-రమణ కూడా అంతే. కలిసి చదువుతారు; ఆడతారు; సాయం చేసుకుంటారు.

అయితే వీళ్ళు వేరు- వాళ్ళు వేరు. వాళ్లకీ-వీళ్ళకీ ఎప్పుడూ పోటీనే.

ఒకసారి ఊళ్ళో పరుగుపందాలు జరిగాయి. పిల్లలంతా అందులో పాల్గొన్నారు.

చాలా దూరం పరుగెత్తాలి, అడవి దారిలో. ఇద్దరిద్దరిది ఒక జట్టు.

చాలా వేగంగా పరుగెత్తాడు రవి- అందరికంటే వేగంగా. వాడి వెనకనే రాము!

అయితే పరుగులో బాగా అలసిపోయాడు రవి. అకస్మాత్తుగా కుప్పకూలిపోయాడు.

వాడు పడిపోవటం చూసి రాము ఆగిపోయాడు. స్నేహితుడిని లేవనెత్తాడు. తలని ఒళ్ళో పెట్టుకొని చెమట తుడిచాడు. సపర్యలు చేస్తున్నాడు.

వాళ్ల వెనకనే పరుగెత్తుకొని వస్తున్నారు సీను-రమణ. సీను వీళ్ళని చూసి నవ్వాడు. బొటన వేలు పైకెత్తి చూపించాడు- "మేమే గెలుస్తాం" అని కళ్ళు ఎగరేసాడు. ఇద్దరూ వీళ్ళని దాటుకొని ముందుకు పరుగు తీసారు.

ఉత్సాహంగా నాలుగడుగులు వేశాక, రమణ అన్నాడు-"వాడికి అస్సలు బాగాలేనట్లుందిరా, పాపం!" అని.

సీను పరుగు కొనసాగిస్తూ "పోనీలే! అట్లాగైనా మనం గెలుస్తాం, ఈసారి!" అన్నాడు.

"ఆగి ఏమైనా సాయం చేద్దామా, పోనీ?" అన్నాడు రమణ, వేగం తగ్గిస్తూ.

"నీ ఇష్టం. చక్కగా గెలిచే అవకాశం మరి, చెయ్యి జారి పోతుందేమో!" అన్నాడు సీను, ఆగుతూ.

ఇద్దరూ వెనక్కి వచ్చారు. రవికి సాయం చేశారు. దగ్గర్లో ఉన్న వాగులోంచి నీళ్ళు తెచ్చి ఇచ్చారు. వాడు తేరుకునేంతవరకూ వెంట కూర్చున్నారు.

ఆలోగా మిగిలిన జట్ల వాళ్ళు అందరూ ముందుకెళ్ళిపోయారు.

తర్వాత ఈ నలుగురూ వాగు దగ్గరికి వెళ్ళి, కాళ్ళు-చేతులు కడుక్కొని, మెల్లగా ఊరు చేరుకున్నారు.

పరుగుల పోటీలో నలుగురూ ఓడిపోయారు.

అయితే ఆ తర్వాత, ఇప్పుడు రాము-రవి-సీను-రమణ నలుగురూ మంచి స్నేహితులు. నలుగురూ కలిసి చదువుతున్నారు; కలిసి ఆడుతున్నారు; నలుగురూ ఒకరికొకరు సాయం చేసుకుంటున్నారు; నలుగురూ సంతోషంగా ఉంటున్నారు. ఊళ్ళో ఎవర్నడిగినా "వాళ్ళు నలుగురూ ఒక జట్టు- చాలా మంచి పిల్లలు. ఏ పనినైనా ఎంత బాగా చేస్తారో!" అంటున్నారిప్పుడు.

మంచి పిల్లల్ని కూడా విడదీసేవి, నిజానికి చిన్న చిన్న గీతలే. వాటిని చెరిపేసుకోవటం ఏమంత పెద్దపని కాదు. కొంచెం పెద్ద మనసుతో ప్రయత్నిస్తే చాలు- ఆపైన గెలుపు అందరిదీ అయ్యే అవకాశం ఉంటుంది- ఏమంటారు?

కొత్తపల్లి బృందం.

> మనుషులకు ముత్యాల దండలు, భుజకీర్తులు అలంకారాలు కావు. పన్నీటి స్నానం, గంధపు పూతలు- ఇవేవీ సౌందర్యాన్ని ఇవ్వవు. చక్కని మాట తీరే మనుషులకు అసలు అలంకారం.
>
> *-భర్తృహరి*




# నీతి చంద్రిక

విగ్రహం-8

*నెమలి రాజు దగ్గర తనకు ఏం జరిగిందో చెబుతున్నది కొంగ. దానిపైన నిందలు మోపిన చిలుకను తప్పుపట్టింది అది. అప్పుడు చిలుక తనను తాను సమర్ధించుకుంటూ మిత్రద్రోహం అనే పులి-కొంగల కథను మొదలు పెట్టింది. ఒక పులి నోట్లో ఓసారి ఒక ఎముక గుచ్చుకుంటుంది; దాన్ని చాలా సతాయిస్తుంది. కొంగ దానికి సాయం చేస్తుంది; అటుపైన అవి రెండూ మిత్రులౌతాయి. ఇక చదవండి, నీతిచంద్రిక 32 వ భాగం...*

*మూలం: కీ.శే. కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

ఒకనాడు అడవిలో ఎంత తిరిగినా ఆ పులికి ఆహారం దొరకలేదు. దానికి చాలా ఆకలి వేస్తున్నది; కడుపు నకనక లాడుతున్నది.

అప్పుడది చాలా విచారిస్తూ- "అయ్యో ఇవాళ్ల ఎంత చెడ్డరోజో కదా! పట్టుపట్టి తిరిగినా ఇవాళ్ళ ఒక ముద్ద మాంసం కూడా నోటికి అందలేదే! సాయంత్రం లోపు దొరికే అవకాశం కూడా పెద్దగా కనబడటం లేదు. ఇన్నాళ్లయింది- ఇంతకు మునుపు ఎప్పుడైనా మాంసం దొరకని దినమంటూ ఉన్నదా? దేవుడు ప్రతికూలిస్తే మన బలం ఎందుకూ పనికిరాదు కదా?! ఇప్పుడిక ఏమి చేయను?

ఇవాళ్ల నా కడుపులో భగభగా మండుతున్న జఠరాగ్నిని శాంతింపజేసే ఆహారం కళ్ళబడకుంటే ఊరికే ప్రాణాలు కోల్పోవాల్సివచ్చేట్టు ఉన్నది.

"మా హింస్యాద్ సర్వభూతాని- ఏ ప్రాణినీ హింసింపకుము" అని ధర్మ సూత్రాలు చెబుతున్నాయి- కానీ తన ప్రాణాలు నిలిచాకనే కదా, ఏలాంటి ధర్మ సూత్రమైనా అక్కరకు వచ్చేది?

"శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం- ధర్మ సాధనకుమొదట అవసరమయ్యేది శరీరమే" అని కూడా చెప్పి ఉన్నారు పెద్దలు. ముందు తనకు ఉంటే తర్వాత పదివేలమందికి పెట్టొచ్చు- అందుకని ధర్మాన్ని తుంగలో త్రొక్కి అయినాసరే, తన్ను తాను కాపాడుకోవాలి.

శరీరం కోసం భూమినైనా తాకట్టు పెట్టవచ్చని చెబుతారు- 'ఆత్మార్థం పృథివీం త్యజేత్ '. నా కడుపులో ఎగసిపడుతున్న ఆకలిని చల్లబరచే మార్గం దొరకకపోతే నా ప్రాణాలు ఊరికే పోయేటట్లున్నాయి. కాబట్టి ఇప్పుడు 'ధర్మ మార్గాన్ని తుంగలో తొక్కైనాసరే, తనను తాను కాపాడుకోవటమే పరమ ధర్మం'.

శరీరంకోసం భూమిని, ఆకాశాన్ని ఐనాసరే వదిలెయ్యాలి- అని నీతి వాక్యం. దాన్ని అనుసరిస్తాను! నేనిప్పుడు ఏదైనా ఉపాయంతో ఈ కొంగను చంపి తింటాను-

కనీసం అట్లాగైనా నా ప్రాణం నిలబడుతుంది- నా ప్రాణం దక్కితే చాలు- తక్కిన పాపాలన్నిటినీ ఏదో ఒక ప్రాయశ్చిత్తం చేసుకొని పోగొట్టుకుంటాను" అనుకున్నది.

అట్లా తన ఆకలిని చల్లార్చుకోవటంకోసం స్నేహితుడి ప్రాణాలకే ఎసరు పెట్టి, అది ఓ ఉపాయం ఆలోచించింది. తలను నేల వాల్చింది- ఇదివరకటి కంటే హెచ్చు స్థాయిలో గొంతు పెంచి, గుహలు మారుమ్రోగేట్లు పెద్దగా దొంగ ఏడుపులు ఏడ్వటం మొదలుపెట్టింది.

పులి అరుపులు విని, చల్లని మనసుగల కొంగ తత్తరపడింది. దాని ప్రాణాలు కలబడ్డాయి. అంతులేని దు:ఖంతో మిత్రునికి ఏమైందోనని పరుగు పరుగున వచ్చిందక్కడికి.

వచ్చి, అది సింహంతో- "మిత్రమా! ఎందుకు ఇవాళ్ళ ఇంత కలవరపడుతున్నావు? చాలా తల్లటపడుతున్నావు కూడా. నీ మనసులో ఉన్న కష్టాన్ని నాతో చెప్పుకునేందుకు ఎందుకు, ఇంత సంకోచం? నేనేమైనా క్రొత్తవాడినా, నీకు? చెప్పు! నీ దు:ఖానికి కారణం ఏంటో చెప్పు. నీకు ఇప్పుడు నా వల్ల ఎట్లాంటి సాయం కావాలన్నా చేస్తాను- నా ప్రాణాలైనా ఇస్తాను" అన్నది.

అప్పుడు ఆ పులి ఒకవైపున తన మనసులో ఉబ్బిపోతూనే, ముఖంలో బాధను అనుకరిస్తూ, జీరబోయిన గొంతుతో- "ఇతరులు నాకు చేసిన మేలును మరచేంత కృతఘ్నుడిని కాను. నా యీ శరీరం అంతా నువ్వు పెట్టిన చెట్టే; సందేహం లేదు. ఇప్పుడు నేను ఇట్లా బ్రతికి ఉన్నానంటే అది నీ చలవే. మిత్రమా! గతంలో నా ప్రాణాలను కాపాడి నాకు మహోపకారం చేసావు. అలాంటి నీకు చిన్న వీసమెత్తు సాయం కూడా తిరిగి చేయలేదే అని సిగ్గుగా ఉంది నాకు.

లోకంలో ఎంతవాడైనా సరే "నేను బలవంతుడిని; నాకు ఇతరులతో ఏమి పని?!" అని విర్రవీగకూడదు. బలవంతులకు కూడా బలహీనులతో సాయం అవసరపడచ్చు. ఆనాడు నువ్వు నా ప్రాణాలు కాపాడావు; నేను బలవంతుడిని; అయినా కూడా నేను నీకు తిరిగి ఎలాంటి సాయమూ చెయ్యలేదు చూడు- అలాంటి నా యీ బ్రతుకు ఎందుకు?

అయినా ఆ దేవదేవుడి మాయ ఎలాంటిదో ఎవ్వరికీ తెలియదు. ఎప్పటికీ నువ్వు చేసిన సాయమే నా కళ్లముందు కదలాడుతున్నది.

దాన్ని అట్లా ఉంచు. అయినా ఇప్పుడు మరొకమారు నీ సహాయమే కోరవలసి వస్తున్నది నాకు! చూశావా, కాల మహిమ?! ఎంత వారికైనా కాల ప్రభావంనుండి తప్పించుకోవటం సాధ్యం కాదు.

ఇప్పటి నా యీ దురవస్థ విను- ఇదివరకు లాగానే ఇప్పుడుకూడా నా పళ్ళ సందులో ఎముక ముక్క ఒకటి ఇరుక్కున్నది; ఆ బాధ భరించలేకున్నాను నేను.

నా అంతటి బలవంతుడికి మేలు చేసి కూడా నువ్వు ఇన్నాళ్ళూ నీ చిన్ని కడుపును

నింపుకునేందుకు పడరాని పాట్లు పడుతూనే వస్తున్నావు- నేను ఇంతలేసి కళ్ళుపెట్టుకొని నీ కష్టాలన్నీ చూస్తూ వచ్చాను తప్పిస్తే, నీకు చిన్నపాటి సాయం కూడా చెయ్యలేదు- నన్ను మన్నించు. నీ పాదాల సాక్షి- ఇకమీదట నిన్ను ఏనాడూ ఆహారంకోసం అటూ ఇటూ తిరగనివ్వను. నేటితో నీ కష్టాలన్నీ గట్టెక్కుతాయి. నా మనసులోని మాటను సత్యంగా పలికాను- నన్ను నమ్ము.



స్నేహితుడికి సాయం చేయవలసిన అవసరం మరొకమారు తలెత్తింది- అందువల్ల ఇక ఆలస్యం చెయ్యకు- మిత్రరక్షణకోసం నా నోట్లోకి దూరు! నన్ను కాపాడు! నా యీ తల్లటను చల్లార్చు!" అన్నది.

అప్పుడు కొంగ సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బైపోతూ- "స్నేహితుడా! ఇదెంతపని! దు:ఖం విడచిపెట్టు! ఇట్లాంటి కష్టాలు ప్రపంచంలో నీకొక్కడికే వస్తాయా ఏమి? విధి రాతనుండి తప్పించుకునేవాళ్ళు ఎవరున్నారు గనుక? ఇది నా చేతిలోని పనేగదా; పరాయివాడిని వేడుకున్నట్లు నన్నూ ఇంత ప్రాధేయపడాలా?

'స్నేహితుడి మనసులోని కోరికను తీర్చటంకంటే చేయదగిన పని వేరే ఏదీ లేదు' అని పెద్దలు చెబుతారు. ఇన్నాళ్లకు నా యీ జన్మ ధన్యం కానున్నది- నా పుణ్యం ఏమని చెప్పను?! చూడు, నేను క్షణంలో పీకేస్తాను ఆ ఎముకను. అయినా ఇది నీ అంత శక్తివంతులకు రావలసిన అవస్థ కాదు" అంటూ తెరచిఉన్న ఆ పులి నోట్లోకి తల దూర్చింది.

మరుక్షణం ఆ పులి చటుక్కున దాని మెడను

కొరికేసి దాన్ని తినేసింది.

చూశావా, దుర్మార్గులు స్వార్థంతో ఎంత పాతకానికైనా ఒడిగడతారు. స్వీయపోషణ కోసం వాళ్ళు మిత్రద్రోహానికి కూడా వెనుదీయరు.

అందువల్ల దుష్టులు ఎంత ఇష్టంగా మాట్లాడినా వాళ్ల మాటల్ని చెవికెక్కించుకోకూడదు.

తప్పిజారి 'విన్నాము' అంటేదానివల్ల మేలు కంటే కీడే ఎక్కువ జరుగుతుంది." అని చిలుక కొనసాగించింది. (మిగతాది మళ్ళీ..)

## ఏమీ కాని ప్రశ్నలు

1.టైరు కాని టైరు..?

జ.సెటైరు

2.టీ కాని టీ..?

జ.ఆంటీ!

3.రాజు కాని రాజు..?

జ.తరాజు!

4.పిడి కాని పిడి..?

జ.పాపిడి!

5.మిడి కాని మిడి..?

జ.మామిడి!

6.పెరగటమే కానీ తరగనిది..?

జ.వయస్సు

-షేక్‌నాగుల్‌షరీఫ్, అరవిందాహైస్కూల్, కుంచనపల్లి.

## తిక్క కవిత!

మా ఇంట్లో ఉంది మా అక్క
అరటికాయ తిని పడేసింది తొక్క
జారి పడింది జిత్తులమారి నక్క
అది ఎవరోకాదు మా అక్క
పడుకోవడానికి వేసింది పెద్ద పక్క
దాని కింద ఉంది ఓ చెక్క
దాని పై పడుకుంది మా అక్క
అంతలో వచ్చింది ఎదురింటి కుక్క
పట్టుకొని లాగింది మా అక్క రెక్క
గబుక్కున లేచింది మా అక్క
తీసుకుంది పక్కకింద ఉన్న చెక్క
భయపడి పారిపోయింది ఎదురింటి కుక్క

*రచన: షేక్‌నాగుల్‌షరీఫ్, అరవిందాహైస్కూల్, కుంచనపల్లి.*



# కోతి తెలివి

*'జంతువులే కదా, వాటికేం తెలుసు' అనుకోకండి. ఈ కథలో కోతి సమయస్ఫూర్తితోటీ, మంచితనంతోటీ ఏమేం సాధించిందో చూడండి..*

*రచన: శ్రీరామనేని ఆర్య, 5 వతరగతి, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

ఒక ఊరిలో చందు-బిందు అనే అన్నా చెల్లెళ్లు ఉండేవారు. చందు ఏడవతరగతి, బిందు నాలుగవ తరగతి చదువుతున్నారు.

ఒకరోజు ఇద్దరూ బడినుండి ఇంటికి వస్తుంటే, దారిలో ఓ చెట్టు కింద చిట్టి కోతి పిల్ల ఒకటి క్రింద పడి కనిపించింది. దానికి ఇంకా చెట్టుపైకి ఎక్కటం వస్తున్నట్లు లేదు. చందు బిందు ఇద్దరూ దాని తల్లి కోసం అటూ ఇటూ కలయ చూసారు- కానీ అది ఎక్కడా లేదు! కోతిపిల్లేమో ఆకలితో కిచకిచలాడుతోంది. "మనం దీనికి ఏమన్నా పెడదామా, తినేందుకు?" అడిగాడు చందు. "పెడదాం

పెడదాం!" అని తన డబ్బాలో మిగిలిపోయిన అరటిపండుని బయటకి తీసి, కోతికి పెట్టింది బిందు. కోతి దాన్ని తీసుకొని తిన్నది.

కొంచెంసేపు అట్లా నిలబడి దాన్ని చూసి, ఇంటికి బయలుదేరారు చందు-బిందు. కొంచెం సేపయ్యాక వెనక్కి తిరిగి చూస్తే కోతి వాళ్ళ వెంటే వస్తోంది! "ఏయ్! వెనక్కి వెళ్ళు" అని ఎంత అరిచినా వింటేగా? ఆ కోతి వాళ్ళ వెనకాలనే ఇంటివరకూ వచ్చేసింది!

"అన్నయ్యా, మనం దీన్ని పెంచుకొందామా?" అన్నను అడిగింది బిందు.

"నాకూ ఇది చాలా నచ్చింది- కానీ అమ్మ ఒప్పుకుంటుందో ఒప్పుకోదో.. అడిగి చూద్దాం!" అన్నాడు చందు.

ఇద్దరూ సంతోషంగా కోతిని ఎత్తుకొని ఇంటి లోపలికి తీసుకెళ్ళారు.

వాళ్ల చేతుల్లో ముడుచుకొని కూర్చున్న కోతిని చూడగానే అమ్మ ఒక్కసారి అదిరిపోయి "గయ్.."మని అరిచింది- "ఏయ్..ఏంటి, ఈ కోతిని నేరుగా ఇంట్లోకే తీసుకొచ్చారు? ఛీ..ఛీ.. ఇది చాలా మురికిగా ఉంది! బయట వదిలెయ్యండి!" అరిచింది అమ్మ.

"వద్దమ్మా, ప్లీజ్! ఈ కోతిపిల్ల చాలా బాగుంది.. ప్లీజ్! దీన్ని మనం పెంచుకుందాం!" అని పిల్లలిద్దరూ అమ్మను బ్రతిమాలారు.

చాలా సేపు వద్దన్నాక, చివరికి అమ్మ ఒప్పుకున్నది- "సరే కానివ్వండి.. కానీ ఇది ఇంట్లో ఉన్న వస్తువులు వేటినీ పాడు చేయకుండా మీరే చూసుకోవాలి. పనులు ఎక్కువౌతాయి.. దాని పనులన్నీ మీరే చేయాలి మరి!" అన్నది అమ్మ.

'ఒప్పుకున్నది- అంతే చాలు' అనుకొని,"సరే" అని ఎగిరి గంతేశారు ఇద్దరూ.

"ఆగండాగండి! ఇప్పుడంటే ఇది చిన్నగా ఉంది. పెద్దదయ్యాక దీన్ని భరించటం నా వల్ల కాదు. అప్పుడింక మీరు దీన్ని అడవిలో వదిలేయాలి.. అందుకు ఒప్పుకుంటేనే, మరి- చెప్పండి!" అంది అమ్మ.

"ఊఁ అట్లా ఏం వద్దు.." అన్నారు పిల్లలు. కానీ అమ్మ ఏమాత్రం తగ్గలేదు. చివరికి పిల్లలే దిగి వచ్చారు. "సరే" అని ఒప్పుకున్నారు. కొంచెం దిగులుగానే తలలు ఊపి, కోతిని ఎత్తుకొని తమ గదిలోకి తీసుకువెళ్ళారు. తన బట్టల బుట్టలో గబగబా ఒక పాత దుప్పటిని పరిచాడు చందు. కోతిని తీసుకెళ్ళి దానిలో పెట్టింది బిందు. పిల్లలిద్దరూ బడి బట్టలు మార్చుకొన్నాక, ఇక దానితో ఆటలు మొదలు పెట్టారు. రోజూ నిద్రలేవగానే వాళ్ళు పాలు తాగేవాళ్ళు. ఇప్పుడు తాము తాగేవి, తినేవన్నీ కోతికి కూడా ఇవ్వటం మొదలుపెట్టారు.

ఇలా రెండుసంవత్సరాలు గడిచాయి. పిల్లలిద్దరికీ కోతి చాలా మంచి ఫ్రెండు అయ్యింది. వాళ్లతోబాటే అది బడివరకూ వచ్చేది. వాళ్ళు బడిలోకి వెళ్ళగానే తను ఒక్కతే ఇంటికి వెళ్ళిపోయేది.

అంతలోనే అమ్మ గుర్తుచేసింది: "కోతి చాలా పెద్దది అయింది. ఇప్పుడింక మీరిచ్చిన మాట ప్రకారం దీన్ని తీసుకెళ్ళి అడవిలో వదిలేయండి" అంది.

పిల్లలిద్దరికీ ఇప్పుడు బడిలో పాఠాల ఒత్తిడి ఎక్కువగానే ఉంది.. కోతితో ఆడేందుకు సమయమే దొరకటం లేదు.. కోతిని అడవిలో వదలటం వాళ్లకు ఇష్టం లేదు.. "అయినా ఇచ్చిన మాట ప్రకారం నడచుకోవాల్సిందే కదా?" అని ఇద్దరూ బాధ పడుతూనే దాన్ని తీసుకెళ్ళి అడవిలో వదిలేసి వచ్చారు.

అడవిలో తిరుగుతూ కొన్నాళ్ళు కోతి ఒంటరిగానే ఉంది. ఒక్కోసారి దానికి చందు-బిందుల దగ్గరికి వెళ్ళిపోదామనిపించింది కూడా. అయితే కొన్నాళ్లకు దానికి ఒక ఏనుగుతో స్నేహం కుదిరింది. "ఇన్ని రోజులూ నువ్వు మనుషుల దగ్గరే ఉన్నావు. నిజానికి ఆ మనుషుల వల్లనే మన అడవి జంతువులకు ప్రమాదం! కాబట్టి నువ్వు జాగ్రత్తగా ఉండాలి!" అని దానికి చెబుతుండేది ఏనుగు. మెల్లగా కోతి అడవి జీవితానికి అలవాటు పడింది.

ఒకరోజు ఏనుగు భయపడినట్లే అయ్యింది. కొందరు మనుషులు చిన్న అడవి జంతువుల్ని పట్టుకునేందుకు ఉరులు తగిలించి పెట్టారు

అడవిలో. ఎప్పటిలాగానే గంతులు వేస్తూ పోతున్న కోతి అనుకోకుండా ఒక ఉరిలో ఇరుక్కుపోయింది. పాపం, దానికి ప్రాణాలు పోయినంత పనైంది. అయితే సమయానికి దగ్గర్లోనే ఉన్న ఏనుగు గబుక్కున తన తొండాన్ని ఆ ఉరిలోకి దూర్చింది. కోతి ప్రాణాలు దక్కాయి. ఆ తర్వాత ఏనుగు ఆ ఉరిని బలంగా నేలకు కొట్టి తొండాన్ని బయటికి లాక్కున్నది. "చూశావా, ఈ మనుషులు? వీళ్ళే, అడవి జంతువులకు ప్రధాన శత్రువులు. వీళ్ళతో జాగ్రత్తగా ఉండాలని చెప్పానుగా, నేను?" అని మందలించింది ఏనుగు. ఆనాటినుండి కోతికి అడవి జంతువుల కష్టాలు ఒక్కటొక్కటే అర్థం అవ్వసాగాయి.

అయితే ఈసారి ప్రమాదం ఏనుగుకి ఎదురైంది. వేటగాళ్ళు ఏనుగుల్ని పట్టుకోవటం కోసం త్రవ్విన గోతిలో పడిందది! అది చూసి కోతి చాలా కంగారు పడిపోయింది. దానికి ఏనుగుని ఎలా కాపాడాలో అర్థం కాలేదు. తనేమో చిన్నదాయె! ఏనుగును ఎలా, పైకి లాగటం? ఆ సమయంలో దానికి చందు-బిందులు గుర్తుకు వచ్చారు. "ఎలాగైనా చందు-బిందులకు ఈ సంగతి తెలియజేస్తే చాలు- వాళ్ళు ఏనుగును కాపాడగలరు" అనుకుంటూ అది చందు-బిందుల ఇంటికి పరుగు పెట్టింది. నిద్రపోతున్న చందుని లేపింది, కిటికీలోంచి. మేలుకొన్న చందూ కోతిని చూసాడు- బిందుని నిద్ర లేపాడు. చూస్తే కోతి కిచకిచలాడుతున్నది; చేతులు ఊపుతున్నది; లోపలికి రమ్మంటే రావటం లేదు. ఏదో ప్రమాదం జరిగిందని గ్రహించారు పిల్లలిద్దరూ. ఏమైందోనని ఇద్దరూ దానివెంట అడవికి వెళ్ళి చూశారు. అక్కడ గుంటలో పడి అరుస్తున్న ఏనుగుని చూశాక వాళ్లకు సంగతి అర్థమైంది . 'మరి ఇప్పుడు ఏం చేయాలి?' -వెంటనే వాళ్ళిద్దరూ ఇంటికి పరుగెత్తి, అమ్మా-నాన్నలకు విషయం చెప్పారు.

చందువాళ్ల నాన్న పోలీసులకీ, అటవీశాఖాధికారికీ ఫోన్ చేసి, అడవిలో ప్రమాదంలోఉన్న ఏనుగు సంగతి తెలియజేశాడు. చందు-బిందులు దారి

చూపారు కదా, కొద్ది గంటల్లోనే పోలీసులు, అటవీ శాఖ వాళ్ళు ఆ ప్రదేశానికి చేరుకున్నారు. ముందుగా వాళ్లంతా కాపువేసి వేటగాళ్ళను పట్టుకున్నారు. అడవి జంతువులను పట్టుకోవటం, వేటాడటం నేరం కదా, అట్లా వాళ్లందరికీ తగిన శిక్షలు పడ్డాయి.



అటవీశాఖ వాళ్ళు గుంతలోంచి ఏనుగును బయటికి తీసి, అడవిలోకి వదిలేసారు. కోతి సంతోషానికి మేరలేదు. అది ఒకసారి ఏనుగు చుట్టూ, ఒకసారి ఇందు-బిందుల చుట్టూ తిరిగి మురిసిపోయింది!

అదంతా చూసిన చందు-బిందుల అమ్మకి కోతి తెలివి తేటల మీద నమ్మకం కుదిరింది. 'దీన్ని తమతో పాటు ఉంచుకుంటే నష్టం ఏమీ లేదు' అని కూడా అర్థమైంది. "సరే, కోతిని మళ్ళీ మన ఇంటికి తీసుకువెళ్దామా?" అంది. కానీ కోతి ఇప్పుడు ఎక్కువ సేపు అడవిలోనే ఏనుగుతో గడుపుతున్నది. అప్పుడప్పుడూ, సెలవురోజుల్లో మాత్రం చందు-బిందులను చూడడానికి వస్తోంది.

జోకు

అంత నవ్వు రాలేదు!

స్వీట్ షాప్ వాడు: ఏవండీ పంతులు గారూ! 'పకోడి' ఇమ్మంటారా?

బ్రాహ్మణుడు: ఏంటీ! నా చేత 'కోడి' తినిపిస్తావా?! కలికాలం ముదిరిందయ్యా!

*-షేక్ నాగుల్ షరీఫ్, అరవిందా హైస్కూల్, కుంచనపల్లి, గుంటూరు.*



# ముగ్గురు స్నేహితులు

*రచన: కె. వెంకటేష్, 10 వతరగతి, నందనగ్రామీణ పాఠశాల, గుంటూరు.*

రాము వెంకటేష్‌లు మంచి మిత్రులు. ఊళ్ళో అందరికీ వీళ్ళని చూస్తే ముచ్చటగా ఉండేది- ఒక్క గోపీకి తప్ప. గోపీకి వీళ్ళిద్దరినీ చూస్తే అసూయ. వీళ్లను విడదీయాలని పట్టుదలగా ఉండేవాడు.

ఒకసారి సెలవుల్లో రాము వెంకటేష్ ఇద్దరూ తిరుపతి వెళ్ళి వద్దామనుకున్నారు. వెంకటేష్ వాళ్ల అమ్మను అడిగితే 200 రూపాయలు మాత్రం సమకూరాయి. "అవి ప్రయాణానికి మాత్రం సరిపోతాయిరా, మిగతా ఖర్చులకు చాలవు. మరెలాగ?" అన్నాడు వాడు రాముతో. "నా దగ్గర కొంచెం ఎక్కువ డబ్బులున్నాయిలేరా, మనిద్దరి ఖర్చులకూ సరిపోతాయి- పరవాలేదు వెళ్దాం" అన్నాడు రాము. ఎట్లాగైతేనేం ఇద్దరూ తిరుపతి వెళ్ళటానికి సిద్ధం అయ్యారు.

ఈ సంగతి తెలిసింది గోపీకి. "ఇదే అవకాశం, వీళ్లిద్దరినీ విడదీసేందుకు" అనుకున్న గోపి వాళ్ల దగ్గరికి వచ్చి "నేను కూడా వస్తానురా, మీతో" అని అడిగాడు.

గోపీకి తామంటే నిజంగా ఇష్టం లేదని తెలుసు రాము, వెంకటేష్ లకు. వాడు తమ స్నేహాన్ని చెడగొట్టాలని ప్రయత్నిస్తున్నాడనీ తెలుసు. "అయినా వెంట వస్తానన్నవాడిని వద్దనేది ఎందుకు?" అనుకొని "సరేలేరా, నువ్వూ రా, వెళ్దాం" అన్నారు.

తిరుపతికి వెళ్ళే రైలు నాలుగు గంటలు ఆలస్యంగా ఉంది. "మనం బస్సులో వెళ్ళిపోదాంరా, రామూ. వెంకటేష్ ఒక్కడినీ రైల్లో రానివ్వు" మొదలుపెట్టాడు గోపి. వెంకటేష్, రాము ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు. "వద్దులే, అందరం కలిసి రైల్లోనే వెళ్దాం. రైల్లో అయితే టిక్కెట్టు ఖర్చు తక్కువ" గట్టిగా జవాబిచ్చాడు రాము.

ముగ్గురూ మెల్లగా తిరుపతి చేరారు. కొండమీదికి వెళ్ళే బస్సు ఎప్పుడుందో కనుక్కునేందుకు వెళ్ళాడు రాము. గోపికేమో వీళ్లను కాలినడకన కొండ ఎక్కించాలని ఉంది. "అన్ని మెట్లు ఎక్కి వెళ్లేసరికి ఇద్దరూ అలిసిపోయి చికాకుగా ఉంటారు. అప్పుడు వీళ్లమధ్య గొడవలు సృష్టించటం సులభం" అనుకున్నాడు.

పైకి వాడు వెంకటేష్‌తో అన్నాడు "చూడురా, రాము దగ్గర డబ్బులు ఎక్కువ ఉన్నట్లున్నాయి. బస్సు ఎక్కి వస్తాడు. అది కూడా ఎప్పుడుందో ఏమో. మనం కాలినడకన చిన్నగా పోతూందాం పద" అని. "వద్దులే, కొంచెం ఆగు. వాడిని రానివ్వు" అని ఎంత చెప్పినా వినలేదు వాడు. "సరే, కానివ్వు" అని వెంకటేష్ గోపీతో కలిసి మెట్లు ఎక్కటం మొదలుపెట్టాడు.

రామూ వెనక్కి వచ్చి చూసుకునే సరికి అక్కడ గోపీ, వెంకటేష్ ఇద్దరూ లేరు! "ఓహో వీడు వెంకటేష్‌ని మెట్లు ఎక్కిస్తున్నాడన్నమాట" అనుకొని రాము కూడామెట్లదారిన వెనకగా నడవటం మొదలుపెట్టాడు.

కొన్ని మెట్లు ఎక్కారో లేదో, వెంకటేష్‌కు కాళ్ళ నొప్పులు మొదలయ్యాయి. అయినా వాడు

"నేనెందుకు ఎక్కలేను? ఎక్కి చూపిస్తాను" అనుకొని తన కాళ్ళు నొప్పులు మరిచి పోయి ఎక్కటం మొదలు పెట్టాడు. అయితే ఇంకొన్ని మెట్లు ఎక్కేసరికి గోపికే కాళ్ళనొప్పులు పుట్టినై. వాడు అక్కడే నిలబడి పోయి, "ఒరే, నాకు కాళ్ళు నొప్పులుగా ఉన్నాయిరా, బస్సులో వెళ్దాం లేరా" అనటం మొదలు పెట్టాడు. "కుదరదురా, ఎట్లాగైనా సరే, మెట్లు ఎక్కాల్సిందే" అని బలవంతం చేశాడు వెంకటేష్. అంతలోనే వెనకనుండి వచ్చి చేరిన రాము కూడా "అవునవును. ఎక్కాల్సిందే" అని పట్టుపట్టి గోపీని నడిపించాడు. "ఇద్దరినీ విడగొడదాం" అని ఆశపడ్డ గోపీకి అదనంగా కాళ్లనొప్పులు వచ్చి పడ్డాయి!

కొండ ఎక్కాక, వెంకటేష్, రాము ఇద్దరూ స్నానానికి వెళ్ళిన సమయం చూసుకొని వాళ్ల బట్టల సంచీలో వెతికాడు గోపీ. తన చేతికందిన రెండు వందల రూపాయల్నీ తీసుకొని పారిపోయాడు! అయితే వీళ్ళిద్దరూ ముందుగానే వాళ్ల దగ్గరున్న మిగతా డబ్బుల్ని వెంట తీసుకెళ్ళారు కాబట్టి సరిపోయింది. "డబ్బులు ఊరికే దొంగ పాలయ్యాయి" అని బాధ పడుతున్న వెంకటేష్‌ని ఓదార్చాడు రాము. "మనల్ని విడగొట్టలేక వాడు ఇట్లా దొంగపని చేసి పారిపొయ్యాడు- అదీ మన మంచికేలే, ఏం పరవాలేదు" అని నచ్చజెప్పాడు.




ఇద్దరూ దైవదర్శనం చేసుకొని, రెండు రోజుల పాటు తిరుపతి చుట్టుప్రక్కల ప్రదేశాలన్నీ చూసి ఇంటికి తిరిగి వస్తూ ఉంటే, దారిలో ఏడుస్తూ కనబడ్డాడు గోపీ. ఇద్దరూ తమ కోపాన్ని మర్చిపోయి గోపీ దగ్గరకు వెళ్ళి

"ఏమైందిరా, ఏం జరిగింది? మా డబ్బుల్ని ఎత్తుకొని పోయావుగా, ఇప్పుడేమైంది?" అని అడిగారు.

గోపీ భోరుమని ఏడ్చాడు- "నాకు తగిన శాస్తి జరిగిందిరా! మీ డబ్బులు ఎత్తుకెళ్ళి నేను అక్కడొక గాజు సామాన్ల దుకాణం ఎదుట నిలబడ్డాను. ఊరికే అక్కడున్న వస్తువుల్ని సవరిస్తూ ఉండగా ఒక వస్తువేదో జారి క్రిందపడి పగిలి పోయింది. అంతే, ఆ దుకాణం వాడు నామీద పడి, కొట్టి, నా దగ్గరున్న డబ్బులు మొత్తం లాక్కున్నాడు. తినేందుకు, ప్రయాణానికి- ఒక్క పైసా కూడా మిగల్లేదు నా దగ్గర! రెండు రోజులుగా నాది ఇదే గతి!" అని ఏడ్చాడు వాడు.

"నువ్వు మమ్మల్ని మోసం చేసి డబ్బు తీసుకొని పోయినందుకు బాగా జరిగిందిరా" అన్నాడు వెంకటేష్ కోపంగా.

"నువ్వు ఊరుకోరా, వెంకటేష్! వీడు ఎంతైనా మన స్నేహితుడేగా, సర్దుకు పోదాం" అంటూ వెంకటేష్‌ను ఆపాడు రాము.

గోపి వాళ్ళిద్దరి మంచితనాన్నీ అర్థం చేసుకున్నాడు. చెడ్డ అలవాట్లను మానుకున్నాడు. కాలక్రమేణా అతనూ వాళ్ల స్నేహితుడయ్యాడు.

జోకు

డాక్టర్: ఏంటయ్యా, నీ సమస్య?

రోగి: ఏం లేదండి.

డాక్టర్: అయితే ఇక్కడికెందు కొచ్చావ్?

రోగి: ఈ పుండు మానడం లేదండి.

డాక్టర్: నీ కేమైనా షుగర్ ఉందా!

రోగి: మా ఇంట్లో బెల్లమే లేదు; ఇంక షుగర్ ఎక్కడిది?!

*-షేక్‌నాగుల్‌షరీఫ్, అరవిందాహైస్కూల్, కుంచనపల్లి, గుంటూరు.*




# ఆలోచనల శక్తి

*మన ఆలోచనలకు ఏం శక్తి ఉంది? -అవి మన మనసు మీద చాలా ప్రభావం చూపుతాయి. మంచి ఆలోచనలు మంచి మనసును, చెడు ఆలోచనలు చెడు మనసును కలుగజేస్తాయి. అయితే ఆలోచనలు వస్తువుల్ని కదిలించవు; అవి ఎవరినీ చంపవు- అలాంటివి నమ్మటం వల్ల మన విజ్ఞానం పెరగకపోవటమే కాదు, మన మనసుకి చెడు జరిగే అవకాశమూ ఉంది. రాణి ఏమనుకుంటున్నదో ఇదిగో, ఇక్కడ ఓ సంభాషణగా రాసింది. ఇదంతా సరికాదేమో కూడా, అసలు- దీన్ని చదివి మీ అభిప్రాయాలు రాయండి మరి....*

*రచన: కె.రాణి, 8 వతరగతి, మాంటిసోరి హైస్కూల్, సప్తగిరినగర్, A క్యాంప్, కర్నూల్.*

నిహార్, జాస్మిత అన్నా చెల్లెళ్ళు. వాళ్ళిద్దరూ ఎప్పుడూ చదువులో మొదట ఉండేవాళ్ళు; చాలా క్రమశిక్షణతో ఉండేవాళ్ళు. పరీక్షలు చక్కగా సంతృప్తికరంగా రాశాక, వేసవి సెలవుల్లో వాళ్ళ అమ్మమ్మ ఇంటికి వెళ్ళారు.

నిహార్: జాస్మితా! నువ్వు నా వెంట రా,

చప్పుడు చేయకు అస్సలు!

జాస్మిత: సరే! ఇప్పుడు మనం ఏం చేయబోతున్నాం?

నిహార్: మనం ఇప్పుడు అమ్మమ్మను ఆశ్చర్యంలో ముంచెత్తబోతున్నాం. మనం ఇక్కడికి వస్తున్నట్లు అమ్మమ్మకు తెలీదు. అందుకని నువ్వు మాట్లాడకుండా, చప్పుడు చెయ్యకుండా ఉండి సహకరిస్తే, నేను వెళ్ళి అమ్మమ్మ కళ్ళు మూస్తాను..సరేనా?

(ఇద్దరూ అమ్మమ్మ వెనకగా వెళ్ళారు. నిహార్ అమ్మమ్మ కళ్ళు మూశాడు..)

అమ్మమ్మ: ఎవరిది!? ఏమిటిది?!...ఏయ్! ఎవరబ్బా?! ఉం.. నా ప్రియమైన మనవడు-మనవరాలు! నిహార్, జాస్మిత వచ్చేశారు అమ్మమ్మ ఊరికి!

(పిల్లలిద్దరూ నవ్వుతూ కళ్ళమీదినుంచి చేతులు తీశారు..)

జాస్మిత, నిహార్: హాయ్, అమ్మమ్మా!

అమ్మమ్మ: ఏరా, పిల్లలూ! నేను బాగున్నాను; మరి మీరు ఎట్లా ఉన్నారు? పరీక్షలు ఎట్లా వ్రాశారు?

నిహార్: చాలా బాగా వ్రాశాము.

అమ్మమ్మ: బాగా రాత్రి అయింది, రండి.. భోజనం చేద్దాంరండి.

నిహార్: జాస్మితా! ఆ స్వీట్ డబ్బాను చాలా జాగ్రత్తగా, క్రింద పడేయకుండా తీసుకొనిరా-

(అట్లా అంటున్నాడో లేదో స్వీట్ డబ్బా క్రింద పడింది.. "టుమ్ టుమ్ టు టు టుమ్..")

జాస్మిత: ఓరి దేవుడా! స్వీట్ డబ్బా క్రిందపడింది!

నిహార్: నేను నీకు చెప్పానుగా, 'దాన్ని జాగ్రత్తగా తీసుకొని రా!' అని?

అమ్మమ్మ: సరే, పోట్లాడుకోకుండా నిశ్శబ్దంగా ఉండండి! పడింది స్వీట్ డబ్బానే కదా, వదిలేయండి! భోజనం చేద్దాం పదండి.

జాస్మిత: మీకు తెలుసా! నేను ముందే అనుకున్నాను- స్వీట్ డబ్బా కింద పడిపోతుందేమోనని!

అమ్మమ్మ: అబ్బ! అయితే నువ్వు అట్లా అనుకున్నావు కనుకనే అది పడిపోయి

ఉంటుంది!

జాస్మిత: అది అలా ఎట్లా సాధ్యం అమ్మమ్మా! మనం అనుకునేది- తర్వాత నిజంగా జరిగేదానికి ఏ విధంగా లింక్ అయి ఉంటుంది?

అమ్మమ్మ: అది అలాగే జరుగుతుంది. ఉదాహరణకు, ఇప్పుడు ఓ పని చెయ్యి- నిహార్ అన్నకు ఆ స్వీట్ డబ్బాని ఇవ్వు. ఆ స్వీట్ డబ్బా వాడి చేతులోంచి క్రింద పడిపోతుందని బలంగా అనుకో.. ఆ ఆలోచననే గట్టిగా పట్టుకో.

జాస్మిత్: సరే, అలాగే ఆలోచిస్తాను- ఏమౌతుందో చూద్దాం

నిహార్: ఆఁ..! స్వీట్ డబ్బా పడిపోయింది!

అమ్మమ్మ: అదే నేనంటున్నది- జాస్మితా, నీకు అర్థమైందనుకుంటాను- అందుకే మనం ఎప్పటికీ నెగటివ్ ఆలోచనలను ప్రసారం చేయవద్దు.

నిహార్: ఎందుకు?

అమ్మమ్మ: మన ఆలోచనలకు చాలా శక్తి ఉంది.మనం బలంగా చేసే ఆలోచనలు నిజం అవుతాయి. ఒకవేళ మనం మంచి ఆలోచనలు చేశామనుకో, అది నిజంగానే జరుగుతుంది. చెడు ఆలోచనలు చేశామనుకో, చెడే జరుగుతుంది-



మీకు తెలుసా, మాయింటి దగ్గర్లో ఇదివరకు ఒక కళాకారిణి ఉండేది. చాలా మంచి మనసుతో అందరికీ సాయం చేసేది. తర్వాతి కాలంలో ఆమె దేశం మొత్తంలోనూ పేరు గాంచిన నాట్యకత్తె అయిందని తెలిసి చాలా సంతోషించాము- ఆమె విజయం ఆమె మంచి ఆలోచనల వల్లనే సాధ్యమయిందని మాకు అనిపించింది.

మరి అట్లాగే ఇంకో సంగతి చెబుతాను- ఒకప్పుడు ఇద్దరు శాస్త్రవేత్తలు- త్రివేద్ మరియు నివేద్ ఉండేవాళ్ళు. ఒకసారి త్రివేద్‌కి ఒక కల వచ్చింది: ఆ కలలో అతని అన్నయ్య నివేద్ చనిపోయాడు; తమ పరిశోధనఫెయిలయింది!

నిద్రలేచాక త్రివేద్ ఆ కలని చాలా సార్లు గుర్తు చేసుకున్నాడు. గుర్తు చేసుకున్నకొద్దీ అతనికి ఇంకా ఇంకా బాధ కలిగింది. మెల్లగా అతనికి తను చేస్తున్న పనుల మీద ఇష్టం, శ్రద్ధ, ఆసక్తి అన్నీ తగ్గిపోయాయి. అంతకు ముందు ఇతను చాలా పరిశోధనలను, చాలా నమ్మకంతో చేశాడు. ఇప్పుడు, ఆ కల గురించి ఆలోచించి ఇబ్బంది పడడం వల్ల అతని పరిశోధనలు సక్రమంగా జరగటం లేదు. క్రమంగా అతని మనసులో అన్నీ నెగటివ్ ఆలోచనలే రాసాగాయి: అతనిప్పుడు అన్ని పనులనూ తప్పుగానే చేస్తున్నాడు. తన కల గురించి నెగెటివ్‌గానే ఆలోచిస్తూ పోవడం వల్ల అతని జీవితంలో నిజంగానే నష్టపరచే సంఘటనలు ఎదురయ్యాయి.

జాస్మిత: ఏమైంది?

అమ్మమ్మ: అతని రీసర్చ్ ఫెయిల్ అయింది. అతను నెగెటివ్‌గా ఆలోచించడం వలన, ఆ నెగెటివ్ ఆలోచనకు పవర్ వచ్చి అలా జరిగిందన్నమాట!

నిహార్: దేవుడా! ఎంత తిరకాసుగా ఉంది!

అమ్మమ్మ: ఇది తిరకాసు కాదు; నిజం! దీనిని బట్టి ఏమి తెలుస్తోంది?

జాస్మిత : నేనూ ఓ పుస్తకంలో చదివాను- ఎవరైనా ఏదో ఒక విషయం గురించి నెగెటివ్‌గా గాని పాసిటివ్‌గా గాని ఒక వారం ఆలోచన చేశారనుకో, అటుపైన అనాలోచితంగా ఆ తవాతి రోజు నుండికూడా అతనికి అవేలాంటి ఆలోచనలు వస్తాయి; ఆ ఆలోచనలకు అనుగుణంగానే అతను ప్రవర్తిస్తాడు. తన ఆ ఆలోచనలను కొద్ది రోజుల పాటు ఆపుకోలేకపోతాడు.

అమ్మమ్మ: అవును- ఎప్పుడు పాసిటివ్‌గా ఆలోచిస్తే పాసిటివ్‌గానే చేస్తావు; పాసిటివ్‌గా ఉంటావు.

నిహార్: ఏమో, మీరు మాట్లాడేదంతా నాకైతే తిరకాసుగానే అనిపిస్తోంది. నేను నిద్ర పోతా! బై! గుడ్‌నైట్! తిరకాసు మాటలు-తిరకాసు ఆలోచనలు! అట్లా అంతా తిరకాసు పనులే చేస్తాం; చివరికి మొత్తం తిరకాసే అవుతుంది- కదూ!

జాస్మిత, అమ్మమ్మ: అబ్బ పోరా! నీకు బాగా నిద్రవచ్చేసింది; పోయి చక్కగా పడుకో.

(నిహార్ నవ్వుతూ పడుకునేందుకు పరుగు పెడతాడు)

## కవిత

అపజయం కలిగిందని నిరాశపడకు
అపజయం విజయానికి తొలిమెట్టు
ఓడిపోయానన్న బాధ అక్కర్లేదు
ఓటమి వెంటే గెలుపుంటుంది.
ఎండ వెంట నీడలా
పగలు వెంట రాత్రిలా
అపజయం వెంట విజయం తప్పక
ఉంటుంది.
మనసు పెట్టి చూడు మార్గముంటుంది.

నీ అపజయానికి కారణం ఆలోచించు
ఆలోచన లేని పని
నీరు లేని బావి లాంటిది
ఒంటరి వాన్నని నిరాశపడకు
నీ నీడే నీకు తోడు
విజయం వైపు నడక సాగించు
విజయాన్ని జయించు
అపజయాన్ని తొలగించు.

*రచన: ఆర్.ప్రగతి,9వతరగతి,జిల్లాపరిషత్‌హైస్కూల్, వెంకటంపల్లి.*



# తృప్తిపరుడు

*ఇదిగో, ఓ మాయ కథ- దీన్ని ఇట్లా కాకుండా మరెన్నో రకాలుగా ముగించే వీలుంది- ప్రయత్నించారంటే మీరు ఈ కథను ఇంకా బాగా మలచగలరు కూడాను- కలం అందుకోండి మరి!*

*రచన: సిద్ధార్థ్ కమ్మ, 7 వ తరగతి, రిషీవ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

ఒక ఊరిలో రాము అనే పేదవాడు ఉండేవాడు. అడవిలో కట్టెలు కొట్టి, వాటిని అమ్ముకొని జీవనం సాగించేవాడు అతను.

ఒక రోజు అతను అలా కట్టెలు కొట్టుకుంటూ ఉంటే ఏవో మాటలు వినపడ్డాయి. 'ఎవరివబ్బా, ఈ మాటలు?' అని కొన్ని అడుగులు ముందుకు వేసి చూశాడు రాము. అక్కడ మూడు ఆవులు మాత్రం ఉన్నాయి. అవి మాట్లాడుతున్నాయి!

అట్లా మాట్లాడే ఆవుల్ని చూసి రాము చాలా ఆశ్చర్య పోయాడు. అవి మ్యాజిక్ ఆవులన్నమాట! వెంటనే అతను వెనక్కి వెళ్ళి, ఆవులకు ఇష్టమయ్యే చక్కని పచ్చగడ్డిని కోసి తెచ్చాడు. తను దూరంగా ఉంటూ గడ్డిని

మాత్రం ఆవులకు అందేలా వేస్తూ వచ్చాడు. ఆ ఆవులు ఆ గడ్డిని మేస్తూ తమకు తెలీకుండానే రాము వెంట వాళ్ల ఇంటికి వెళ్ళాయి.

ఒకసారి ఇల్లు చేరుకోగానే రాము వాటిని గబగబా కొట్టంలోకి తీసుకువెళ్ళి కట్టేసాడు. తనేమో పేదవాడు- మామూలు ఆవుల్ని కూడా కొనుక్కునేంత శక్తి లేదు. అట్లాంటి తనకోసం మాట్లాడే ఆవుల్ని దేవుడే పంపించాడని తన అదృష్టానికి పొంగిపోతూ, సంతోషంగా నిద్రపోయాడు.



ఉదయాన్నే లేచి ఆవులతో మాట్లాడాలని కొట్టం తలుపు తెరిచి చూస్తే ఏముంది? ఆవులు లేవు!

అయితే రాము తెలివైన వాడు కదా, చుట్టు ప్రక్కల అంతా జాగ్రత్తగా వెతికాడు. కొంచెం దూరంగా బురదలో ఆవుల అడుగుజాడలు కనిపించాయి. వాటిని అనుసరిస్తూ అడవిలోకి వెళ్ళాడు రాము. కొట్టంలోంచి తప్పించుకొని అక్కడికి వెళ్ళిన ఆవులు అతను తమవెంట రావటం చూసి కంగారు పడ్డాయి. "ఇదేంటి, వీడు మనవెంట పడ్డాడు?" అని అవన్నీ ఒక్కసారిగా క్రిందపడి, చచ్చిపోయినట్లు నటించడం మొదలు పెట్టాయి. ఆవులు అన్నీ అట్లా క్రింద పడి ఉండటం చూసి రాము చాలా ఆందోళనతో పోయి వాటి పక్కన కూర్చున్నాడు. తన కారణంగానే అవన్నీ చచ్చిపోయాయేమో అని వాడికి చాలా బాధ వేసింది. అంతలో ఒక ఆవు కనురెప్పలు కదలడం చూసాడు వాడు. "ఓహో! ఇవి నన్ను చూసే ఇట్లా నటిస్తున్నాయన్నమాట!" అనుకున్నాడు.

"ఎందుకు నన్ను మోసం చేస్తున్నారు? నేను

మీకు మేత, నీళ్ళు ఇచ్చి నా దగ్గర ఉంచుకుందామనుకున్నాను- అంతే తప్ప మిమ్మల్ని నేను ఏమీ చేయలేదే?" అడిగాడు రాము.

అప్పుడు మూడు ఆవులూ లేచి, నవ్వుతూ అన్నాయి- "మేము మనుషుల దగ్గర జీవించలేము, రామూ! అయితే నీ మంచి మనస్సుని బాధ పెట్టటం కూడా మాకు ఇష్టం లేదు. నీ పేదరికాన్ని పోగొట్టడానికి ఏవైనా మూడు వరాలు ఇస్తాము- కోరుకో" అని.

"ఒక మంచి ఇల్లు, మీ లాంటి మూడు చక్కని ఆవులు, ఓ ఎద్దులబండి ఇవ్వండి చాలు" అని కోరుకున్నాడు రాము.

"ఇతను దురాశకు లోనవ్వలేదు; తనకు తగినట్లుగానే వరాలను కోరుకున్నాడు!" అని ఆవులు సంతోషపడ్డాయి.

"సరే, ఇవన్నీ రేపు ప్రొద్దున నువ్వు నిద్ర లేచేసరికి నీ దగ్గర ఉంటాయి" అని చెప్పి ఆవులు రాముకి కనపడకుండా వెళ్ళిపోయాయి.

పొద్దునలేచి చూసేటప్పటికి రాము ఒక పెద్ద ఇంట్లో ఉన్నాడు! ఇంటి బయట మూడు చక్కని ఆవులు, ఒక ఎద్దుల బండి ఉన్నాయి! వాటితో రాము తన జీవితాన్ని సంతోషంగా గడిపేసాడు.

## వాక్యాల గజి బిజి!

1. వంద భక్ష్యములు భక్షించు లక్ష్మయ్యకు ఒక్క భక్ష్యమొక లక్ష్యమా!

2. కాకీక కాకికి కాక కుక్కకా!

3. నీ నాన్న నా నాన్నని నేనన్నానా, నా నాన్న నీ నాన్నని నేనన్నానా, నీ నాన్న నీ నాన్నే, నా నాన్న నా నాన్నే

4. నీ నూనె నా నూనెని నేనన్నానా, నా నూనె నీ నూనెని నేనన్నావా నీ నూనె నీ నూనే, నా నూనె నా నూనే.

*సేకరణ: పి.పుష్ప, చెన్నేకొత్తపల్లి.*



# బద్ధకం నుండి విముక్తి

*మీకూ ఉందా, బద్ధకం? ఇదిగో పుల్లారావు రాసిన ఈ కథ చదవండి. మీ బద్ధకాన్ని ఇట్లా వదిలించుకోవచ్చేమో చూడండి!*

*రచన: పి.పుల్లారావు, నందన గ్రామీణ పాఠశాల, గుంటూరు.*

రామయ్య అనే రైతు దగ్గర ఒక ఆవు ఒక మేక ఉండేవి. మేక ఎప్పుడూ చురుకుగా, తన పని తను చేసుకుంటూ ఉండేది. ఆవు బద్ధకంగా, 'ఎవరైనా ఎప్పుడూ తనకు గడ్డి తెచ్చిపెడితే బాగుండును కదా' అనుకుంటూ ఉండేది. అయితే మేకకు ఒక్కతే మేత మేయటం ఇష్టం ఉండదు కదా, అందుకని ఏదో ఒక మాయ చేసి రోజూ ఆవుని కూడా తన వెంట తీసుకెళ్తూ ఉండేది. అయినా పెద్దగా ప్రయోజనం ఉండేది కాదు- నాలుగడుగులు వేయగానే ఆవు ఆగిపోయేది- "ఇంక చాలు బాబూ! ఇక్కడ ఏది దొరికితే అది మెయ్యి! నేను ఇంటికెళ్ళాక తింటానులే!" అనేది.

ఒక సారి, రామయ్యకు పొరుగూరిలో ఏదో పని పడింది. "సాయంత్రానికి ఎలాగూ వస్తాలే" అనుకొని, ఆవునీ మేకనీ వదిలేసి, తను ఊరికి

బయలుదేరి పోయాడు. అక్కడక్కడే తిరుగుతున్న ఆ రెండిటికీ ఒక గుర్రం ఎదురైంది. "చూస్తే మీరు చాలా మంచివాళ్ళలాగున్నారు. నేనూ మంచివాడినే. మనం స్నేహం చేద్దామా?" అని అడిగిందది.

"ఓ సరే! ఇప్పటినుండీ మన ముగ్గురం స్నేహితులం" అంది మేక.

మేక, గుర్రం చురుకుగా అక్కడున్న గడ్డినంతా తిన్నాయి. ఆవు మాత్రం ఏమీ తినకుండా ఊరికే పడుకున్నది.

"రా! తిను! గడ్డి పర్వాలేదులే, బానే ఉంది!" అంది గుర్రం.

"లేదు. నేను ఇంటికెళ్ళాక తింటాను" అంది ఆవు.

"ఇక్కడే తినచ్చుగా, మాతోబాటు?" అని గుర్రం ఎంత చెప్పినా అది వినలేదు.

"నాకు ఇంటికెళ్ళాక తినటమే అలవాటు" అని చెప్పి తప్పించుకున్నది.

ఆ రోజు ఇంటికెళ్ళే సరికి ఇంట్లో ఎవరూ లేరు- రాత్రైనా ఆవుకి మేత దొరకనే లేదు. సాయంత్రానికే వద్దామనుకున్న రామయ్యకు పని పూర్తి కాక, మరొక రోజు అక్కడే ఉండిపోవాల్సి వచ్చింది మరి!

మరునాడు తెల్లవారే సరికి ఆవుకి నీరసం ముంచుకొచ్చింది. అయినా అది కదిలేటట్లు, సొంతగా మేత మేసేటట్లు కనబడలేదు.

మేక ఈ సంగతి చెప్పే సరికి గుర్రం - "ఎవరినైనా సరే ఒకసారి బద్ధకంపట్టుకున్నదంటే ఊరికే వదలదు- చాలా ప్రయత్నించాల్సి ఉంటుంది. ఇవాళ్ల మనం ఏదో ఒక మాయ చేసి, ఆవు సొంతగా మేత మేసేట్లు చేద్దాం" అన్నది.

అటుపైన అది ఆవుకి వినబడేట్లు మేకతో- "మిత్రమా! మన ఊళ్ళో అదిగో- ఆ పెద్ద కొండ ఉంది గదా," అన్నది- "ఆ కొండ దగ్గర చాలమంచి మేత ఉందట! అది మనకి మాత్రమే తెలిసింది- వేరే ఎవ్వరికి తెలియదు! అందుకని మనం ఇప్పుడు ఆ కొండ దగ్గరకు వెళ్ళి మేసి వద్దాం" అన్నది.

దాని పథకం అర్థం చేసుకున్న మేక "భలే భలే! ఇవాళ్ల మా యజమాని ఎలాగూ ఊళ్ళో లేడు! పోయి వద్దాం పద! కడుపునిండా పచ్చగడ్డి

తిని ఎన్ని రోజులైందో" అన్నది.

అయితే ఆవుకి బద్ధకం కదా! అది అన్నది- "నేను రానులే, మీరే నాకు కూడా కొంచెం గడ్డి తెచ్చి పెట్టండి. ఇవాళ్ల నాకు కొంచెం నీరసంగా ఉన్నది" అన్నది.

మేకకు ఏం చెప్పాలో తెలీలేదుగానీ, గుర్రం అన్నది- "అట్లా కుదరదమ్మా! మేం నీకు గడ్డి తెస్తే, మరి మా పిల్లలకు ఎవ్వరు తెచ్చిపెడతారు? మాకు ఆకలిగా ఉంది- నువ్వు వస్తే రా, లేకపోతే మేము ఇద్దరమే పోతాం మరి!" అని మేకను బయలుదేరదీసింది.

వెంటనే ఆవు కూడా లేచి నిలబడింది- "సరే! నేను కూడా వస్తాను! మరి ఆ ప్రదేశం దగ్గరలోనే ఉందిగా? ఏమంత దూరం కాదుగా?" అని అడిగింది.

మేక , గుర్రం అన్నాయి- "అదిగో, ఆ కొండే! ఇక్కడే!" అని.

ఆవు బద్ధకంతో మెల్లగా నడవసాగింది. దానికి ఆకలౌతున్నది మరి! చూడగా దానికి సరిపడేంత గడ్డి దగ్గర్లో ఎక్కడా కనబడలేదు. అందుకని అది లేని శక్తిని కూడగట్టుకొని ఎలాగో ఒకలాగ కొండ వరకు నడిచింది.

"ఇంకా ఎంత దూరం?" అని అడిగిందది, గుర్రాన్ని.

"ఇదిగో, ఈ కొండేగా?! మీరు రండి నా వెనకనే" అంది గుర్రం గబగబా కొండ ఎక్కేస్తూ.

"అబ్బ! ఈ గుర్రం ఎంత చురుకైనదో, చూడు! ఎంత చక్కగా కొండ ఎక్కుతున్నదో!" అన్నది మేక.

"దానిదేముందిలే, మనం మాత్రం చురుకుగా ఎక్కటం లేదూ?" అంది ఆవు, కొంచెం తెచ్చిపెట్టుకున్న పట్టుదలతో.

ఆవు పట్టుదల, మేక ప్రోత్సాహం రెండూ కలిసి వాటిని కొండలో నాలుగో వంతు వరకూ ఎక్కించాయి. ఆసరికి ఆవు పట్టుదల సడలిపోయింది. "ఇంక నేను నడవలేనమ్మా! నాకు ఇక్కడికే తెచ్చివ్వు ఆ గడ్డేదో" అని అక్కడే కూలబడ్డది. "ఆ గుర్రం ఎక్కగా లేనిది మనం ఎక్కలేమా? మన పరువు ఏం కావాలి?

నువ్వు ఎక్కగలవులే, ఊరికే వెనకంజ వేయకు!" అని ప్రోత్సహించింది మేక.

"సరేలే కానివ్వు" అని ఆవు కొండ సగం వరకూ ఎక్కి కూల బడింది. "ఇంక నావల్ల కాదు- నేను ఎక్కలేను" అన్నది.

మేక అన్నది- "చూడు, ఇప్పుడు మనం సగం వరకు ఎక్కాం. మనతోపాటు వచ్చిన గుర్రం కొండను పూర్తిగా ఎక్కేసింది చూడు, హాయిగా మేతమేస్తున్నది పైన" అని ఆశపెట్టించింది మేక. పైన పచ్చ గడ్డి దగ్గర్లోనే ఉందన్న ఆశతోఆవు మూడు వంతుల కొండను ఎక్కేసి, అక్కడ కూలబడింది.

"చూడు, మూడు వంతుల కొండని ఎలాగూ ఎక్కనే ఎక్కాం. ఇప్పుడు ఇంక ఖాళీ కడుపుతో కిందకు వెళ్ళటం కంటే కళ్ళు మూసుకొని ఆ కొంచెం కొండా ఎక్కటమే మంచిది. ఒక్కదానివే ఇక్కడ కూర్చొని ఏం చేస్తావు?" అన్నది మేక గడుసుగా.

ఇట్లా ఆవు కొంచెం దూరం నడవటమూ, 'నేనూ నడవలేను' అని కూలబడటమూ, మేక ఓర్పుతో 'ఇంకొంత దూరం మాత్రమే' అని చెప్పటమూ, పైనుండి గుర్రం 'తొందరగారండి' అని పిలవటమూ- దీంతో ఆవు చివరికి ఎలాగో కొండనెక్కేసింది!

ఆ మరునాడు కూడా రామయ్య ఊరికి రాలేదు! పచ్చగడ్డి ఆలోచనతోటే ఆవుకి నోట్లో నీళ్ళు ఊరాయి. అది గుర్రం, మేకల వెంట ఉత్సాహంగా బయలుదేరి వచ్చింది- ఈరోజున అది దారి మధ్యలో అస్సలు సణగనే లేదు! మిగిలిన రెంటితోపాటు చకచకా కొండనెక్కేసింది!

మరునాడు రామయ్య వచ్చాక, దానికి మళ్ళీ ఓసారి అనుమానం వచ్చింది- "తను కొండనెక్కగలదా?" అని.

"నువ్వు తలచుకుంటే ఏ పనినైనా చెయ్యగలవు" అని మేక, గుర్రం నమ్మబలికాక, అది నవ్వుతూ "సరే, పదండి ఏం చేస్తాం?! పచ్చిగడ్డి కావాలంటే కొండనెక్కాల్సిందే మరి!" అని ముందుండి కొండకు దారితీసింది!

దానిలో మార్పును గమనించి రామయ్య చాలా ఆశ్చర్యపోయాడు.



# పిసినారి పుల్లయ్య

*సేకరణ: యల్.మునీశ్వరి, 8 వతరగతి, జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, పెద్దపసుపుల.*

ఒక ఊళ్లో ఓ పిసినారి పుల్లయ్య ఉండేవాడు. అతను ఎవ్వరికీ ఏదీ ఇచ్చేవాడు కాదు. ఎప్పుడూ 'ఎట్లా పైసలు మిగల బెట్టాలా' అనే ఆలోచించేవాడు. అతని పిసినారితనం చూసి ప్రజలంతా ఆశ్చర్యపోయేవాళ్ళు.

అట్లాంటి పిసినారి పుల్లయ్య కూడా సంవత్సరానికి ఒకసారి పండగరోజున దేవుడికి ఒక టెంకాయ కొట్టేవాడు. ఒకసారి అట్లాంటి పండుగ వచ్చింది. టెంకాయ కావాలి. పుల్లయ్య తమ ఊళ్ళోని దుకాణానికి వెళ్ళి "టెంకాయ ఎంత?" అని అడిగాడు. "నాలుగు రూపాయలు" అన్నాడు దుకాణదారు. "మూడు రూపాయలకు ఇస్తావా?" అడిగాడు పుల్లయ్య.

పుల్లయ్య తత్వం తెలిసిన దుకాణదారు నవ్వాడు. "మన ఊళ్ళో అంతటా నాలుగు

రూపాయలేనయ్యా! ప్రక్క ఊర్లో మూడు రూపాయలకు దొరకచ్చు చూడు" అన్నాడు.

పుల్లయ్యకు ఆ ఆలోచన నచ్చింది. తను నడుచుకుంటూ ప్రక్క ఊరికి వెళ్ళాడు- "టెంకాయ ఎంత?" అంటే అక్కడి దుకాణదారు "మూడు రూపాయలు" అన్నాడు. "రెండు రూపాయలకు ఇచ్చెయ్యరాదూ?" అన్నాడు పుల్లయ్య, అలవాటుగా.

దుకాణంవాడు పుల్లయ్యకేసి వింతగా చూస్తూ-"ఆ ధరకి ఇక్కడ రాదు- మూడు ఊళ్ళ అవతల రామాపురంలో ఉంది ఆ రేటు" అన్నాడు. పుల్లయ్యకు డబ్బులు ఎక్కువ పెట్టేందుకు మనసు రాలేదు. రామాపురం బయలు దేరాడు.

తీరా రామాపురం చేరే సరికి మధ్యాహ్నం దాటింది. "రెండు రూపాయలకు ఒక టెంకాయ!" అరుస్తున్నారు అక్కడి వ్యాపారులు. పుల్లయ్య వాళ్ల దగ్గరికి వెళ్ళి- "ఒక రూపాయికి ఇవ్వరాదూ?" అని అడిగేశాడు.

"నువ్వెవరో పిసినారి పుల్లయ్యలాగే ఉన్నావే!? ఇంతకంటే తక్కువ ధరకి కావాలంటే లక్ష్మీపురం తోటకి పోవాల్సిందే" అన్నారు వాళ్ళు.

పుల్లయ్య అక్కడి నదిని దాటి, సాయంత్రంకల్లా లక్ష్మీపురానికి పదికిలోమీటర్ల దూరంలో ఉన్న తోటకు చేరుకున్నాడు.

అతను అక్కడికి వెళ్ళేసరికి తోట యజమాని క్రింద నిలబడి ఉన్నాడు. పనివాళ్ళు చెట్లెక్కి కొబ్బరికాయలు కోసి, క్రింద కుప్ప చేస్తున్నారు.

"ఒక రూపాయికొక కొబ్బరికాయట కదా, మీ దగ్గర?" అడిగాడు పుల్లయ్య.

"అవును-మీకు ఎన్ని కావాలి?" అడిగాడు తోట యజమాని.

"ఊరికే ఇవ్వచ్చుకదా, ఒక కొబ్బరికాయకు ఒక రూపాయా, మరీ దురాశ కాకపోతే?!" అన్నాడు పుల్లయ్య.

"మీదే ఊరు?" అని అడిగి తెలుసుకుని, "మీ ఊళ్ళో పుల్లయ్యగారని ఎవరో ఉన్నారటనే?" అన్నాడు తోట యజమాని.

"నేనే ఆ పుల్లయ్యని!" అన్నాడు పుల్లయ్య, 'తన ఖ్యాతి ఇంత దూరం వ్యాపించిందే' అని సంతోషపడుతూ.

తోటయజమాని నవ్వాడు. "ఓహో మీరేనన్నమాట! మీఅంతటివారు శ్రమపడి ఇంత దూరం నడిచి వచ్చారు; అందులోనూ దేవుడికి అంటున్నారు; ఊరికే కావాలంటున్నారుగా, చెట్టెక్కి కోసుకోండి ఎన్ని కావాలంటే అన్ని! క్రిందివి కావాలంటే మటుకు రూపాయికొకటి!" అన్నాడు.

పుల్లయ్యకు చెట్టు ఎక్కటం రాదు. అలాగని రూపాయి ఇచ్చి కొబ్బరికాయ కొనుక్కునేందుకు మనసొప్పలేదు కూడాను. "చెట్టెక్కుతాను-ఆమాత్రం నేర్చుకోలేనా?" అనుకున్నాడు.

చాలా శ్రమపడి, నిక్కుతూ నీల్గుతూ అంత పొడుగున్న కొబ్బరి చెట్టెక్కేశాడు పుల్లయ్య. ఆలోగా అతని కాళ్ళూ, చేతులూ గీసుకుపోయి రక్తం కారసాగింది. అయినా డబ్బు ఖర్చులేకుండా కొబ్బరి కాయ వచ్చేస్తుందన్న ఆశ అతన్ని చెట్టెక్కించింది.

చెట్టెక్కాక పుల్లయ్యకు అనిపించింది- "ఒక్క కాయే ఎందుకు? ఓ బస్తాడు కోసుకుంటే పోలేదూ?" అని.

అట్లా ఒక మూడు నాలుగు కాయలు కోసి పంచెలో వేసుకున్నాడు. ఆ హడావిడికో, మరి టెంకాయల బరువు మోయలేకనో, మరి- పుల్లయ్య పంచె కాస్తా జారిపోయింది!

అయినా పట్టువదలని పుల్లయ్య చేతులు వదిలి పైన ఉన్న కొబ్బరి కాయను పట్టుకోబోతూ, ఒక్కసారిగా క్రిందికి చూశాడు- ఎప్పుడూ ఎక్కనంత ఎత్తు! అంత ఎత్తునుండి చూసేసరికి ఒక్కసారిగా కళ్ళు తిరిగాయతనికి! అంత ఎత్తునుండి పట్టు తప్పిక్రిందపడిపోయిన పుల్లయ్యకు నడుం విరిగింది! అటుపైన డాక్టరు ఖర్చులు వంద రూపాయలు దాటాయి!

'గోటితో పోయేదానికి గొడ్డలి' అంటే ఇదేనేమో!




# మేలు చేసిన మంచం

*సేకరణ: కె.వినయ్, 7 వతరగతి, తేజటాలెంట్‌స్కూల్, కోదాడ.*

కోదాడలో ఉండే సమతయ్య పడుకునే మంచం ఒకరోజు విరిగిపోయింది.

కొత్త మంచం కొనాలని సంతకి బయల్దేరాడు అతను. అయితే అతను అటు బయలుదేరే సరికి ఎదురింటి ఎల్లయ్య ఎదురయ్యాడు.

"ఎటు పోతున్నావు సమతయ్యా?" అని అడిగి, సంగతి తెలుసుకొని, "మా ఇంట్లో నిక్షేపంలాంటి మంచం ఒకటుంది. సగం ధరకే ఇస్తాను. దానికోసం వృధాగా సంత వరకు వెళ్ళేదెందుకు?" అన్నాడు.

'సగం ధర'అనే సరికి సమతయ్యకు ఆశ పుట్టుకొచ్చింది. ఎల్లయ్య సలహా నచ్చింది. ఆ మంచాన్ని కొనుక్కొని, వెంటనే వాడుకోవటం కూడా మొదలుపెట్టేశాడు.

అయితే ఇది జరిగే సమయానికి సమతయ్య భార్య సన్నమ్మ ఊళ్ళో లేదు. అతను మంచం

కొనేసిన తర్వాత రెండు రోజులకి సన్నమ్మ పుట్టింటి నుంచి వచ్చింది. వస్తూనే పాత మంచం విరిగిన సంగతీ, కొత్తమంచం తెచ్చిన సంగతీ తెలుసుకుని ఒంటికాలిమీద లేచింది- "మీ తెలివి తెల్లారినట్టే ఉంది. ఎల్లయ్య తండ్రి దీని మీదే పడుకునేవాడు. ఏదో తెలీని రోగం వచ్చి చచ్చి పోయాడాయన. ఆ తర్వాత అది వాళ్ళ ఇంట్లోనే పడి ఉండేది- 'రోగాలు అంటుకుంటాయేమో ' అని దాన్ని ఎవరూ వాడేవాళ్ళు కాదు. అట్లాంటి ఆ మంచాన్ని తెలివిగా నీకు అంటగట్టాడు ఎల్లయ్య! తేరగా వస్తున్నదిగదా అని నువ్వు తెచ్చి పెట్టుకున్నావు ఆ దరిద్రాన్ని. ఇదిమనకెందుకు? వెళ్ళు! దీన్ని తిరిగి ఇచ్చేసి మన డబ్బులు వెనక్కి పట్టుకురా!" అంటూ తరిమింది.

అయితే ఆ మంచాన్ని వెనక్కి తీసుకోనన్నాడు ఎల్లయ్య! "ఒకసారి కొనేశాక ఏ వస్తువైనా నీదే! నీ వస్తువును నేనెలా తీసుకుంటాను?" అన్నాడు.

అది విని సన్నమ్మ కస్సుమనిలేచి, 'ఇది మాత్రం ఇంట్లో ఉండడానికి వీల్లేదు. తీసుకెళ్ళి పాడుబడ్డ ఏ బావిలోనో పడేసిరా! దీన్ని తెచ్చావంటే ఇంక నిన్ను కూడా ఇంట్లోకి రానిచ్చేది లేదు' అని తేల్చి చెప్పేసింది.

ఇంక ఏమీ అనలేక, సమతయ్య ఆ మంచాన్ని నెత్తిన పెట్టుకుని, అడవిలో ఓ పాడుపడిన బావి దగ్గరకు పోయాడు. అక్కడికెళ్ళాక మంచాన్ని ఎత్తి బావిలోకి వెయ్యబోతూ అనుకోకుండా ఓ రాయిని తన్నుకుని ముందుకు పడ్డాడు. మంచం కాస్తా చటుక్కున జారి అక్కడున్న ఎండుటాకుల కుప్ప మీద పడింది 'దబ్బ్..న. సరిగ్గా అదే సమయానికి కొందరు దారి దోపిడి దొంగలు తాము దోచుకున్న నగల్ని ఆ ప్రక్కనే కూర్చొని పంచుకుంటున్నారు. అకస్మాత్తుగా 'దబ్బ్..'మనేసరికి అదేదో తుపాకీ పేలిన శబ్దం అనుకున్నారు వాళ్ళు. ఇంకేముంది, వాళ్ళు బెంబేలు పడి నగలన్నీ ఎక్కడివక్కడ వదిలేసి పరుగు లంకించుకున్నారు.

ఇదేమీ తెలీదుగా, సమతయ్యకు? అతను లేచి దేవుడిని, తన భార్యను తిట్టుకుంటూ మంచాన్ని లేవనెత్తి, ఈసారి బలంగా

నూతిలోకి పడేట్లు విసిరి, వెనక్కి తిరిగి ఇంటికి బయల్దేరాడు. ఇంకా పది అడుగులు వేశాడో లేదో, అతని వెనక చప్పుడైంది- నిండా తడిసి ఉన్న ఒకాయన అతడిని వెనక్కి పిలిచి- "చూడు బాబూ! నువ్వెవరో దేవుడిలాగా వచ్చావు. ఇంతకు కొంచెం సేపు ముందే దొంగలు నా డబ్బంతా దోచుకుని, నన్ను నూతిలోకి తోసేశారు. నీ మంచం దయ వల్ల బయటపడ్డాను- నా డబ్బంతా నాకు దొరికింది. ఇందులో సగం నీది! తీసుకో!' అంటూ కొంత డబ్బు, కొన్ని నగలు ఇచ్చి , మంచాన్ని కూడా జాగ్రత్తగా అప్పగించి చక్కాపోయాడు!

పారేసిన మంచం తిరిగి అంటుకోవటంతో సమతయ్యకు ఏం చేసేదీ పాలుపోలేదు. అయోమయంగా దిక్కులు చూస్తూ అక్కడే నిలబడ్డ సమతయ్యను కొందరు గిరిజనులు చుట్టుముట్టారు అంతలోనే-

'దేవుడిలా సమయానికి కనిపించావు మంచాన్ని చేతబట్టుకొని! మా ఆడమనిషి పురిటి నొప్పులతో బాధ పడుతోంది. నీ మంచం ఇచ్చావంటే ఆమెను పొరుగూరు మోసుకుపోతాం!' అంటూ బ్రతిమలాడారు.

"ఆహా! మంచం ఇట్లా వదిలిపోతున్న దన్నమాట!" అనుకొని సమతయ్య సంతోషంగా దాన్ని వాళ్లకిచ్చేసి ఇంటి ముఖం పట్టాడు.

అట్లా కొంత దూరం వెళ్ళాడో, లేదో- ఆ గిరిజనులు పరుగున వచ్చారు వెనకనుండి: 'ఓరయ్యా! నీ మంచం మహిమో, ఏమో- మా ఆడమనిషికి వెంటనే సుఖ ప్రసవం అయింది; పండంటి బిడ్డ పుట్టాడు! నూరేళ్ళు సల్లంగ బ్రతుకు!" అంటూ సంబరంగా కొంత డబ్బు చేతిలో పెట్టి, మంచాన్ని తిరిగి సమతయ్యకే అప్పగించి వెళ్లిపోయారు.

సమతయ్యకు ఆ మంచాన్ని చూస్తే బెంగ పట్టుకున్నది. "అది తనను వదిలేలా లేదు! దాన్ని పట్టుకొని తను ఇంటికెళ్తే సన్నమ్మ సన్నగా తిట్టదు! ఏం చెయ్యాలి?" అని అతను దాన్ని అక్కడే, అడవి మధ్యనే వదిలేసి వెనక్కి తిరిగి చూడకుండా ఇంటికి పరుగు పెట్టాడు.

అతను ఇల్లు చేరే సరికి బాగా చీకటి పడింది. సన్నమ్మ మంచి నిద్రలో ఉంది. "ఇదే చాలురా, దేవుడా" అని సమతయ్య డబ్బుల్ని పెట్టెలో దాచి ఏమీ తినకుండానే పడుకొని నిద్రపోయాడు.



మర్నాడు తెలతెలవారగానే తలుపులు చప్పుడయ్యాయి. సమతయ్య దంపతులు తలుపు తీసి చూస్తే, ఎదురుగా రాజభటులు!

"నిన్న అడవిలో వేటకు వెళ్లి అలసి పోయిన మహారాజుగారికి ఎదురుగా ఈ మంచం కనిపించిందట. రాత్రంతా హాయిగా నిద్రపోయారట! ఇది ఎవరిదో కనుక్కుని, వాళ్లకు మంచంతోపాటు ఈ వజ్రాల హారాన్నికూడా కానుకగా ఇవ్వమన్నారు!" అంటూ వాళ్ళు ఆ హారాన్ని చేతికిచ్చి మంచాన్నికూడా మర్యాదగా ఇంట్లో పెట్టి వెళ్లిపోయారు!

'మంచం మళ్ళీ వచ్చిందే' అని ఏడుపు ముఖం పెట్టిన సమతయ్యను సన్నమ్మే ఓదార్చింది. "ఈ మంచం వల్లనేకదా, మనకింత సిరి వచ్చింది?! అంటే ఇదేదో చాలా మంచి మంచమేనన్నమాట! నేనే తప్పుగా అర్థం చేసుకున్నాను. రాజులు మెచ్చిన మంచం! దీన్ని మన ఇంట్లోనే ఉంచుకుందాం!' అంది అబ్బురంగా.

సమతయ్య సంతోషంగా ఊపిరి పీల్చుకున్నాడు.

అందరితో మర్యాదగా వ్యవహరించు. ఎక్కువమందితో కలుపుగోలుగా ఉండు. తక్కువ మందిని పరిచయం చేసుకో. ఒక్క ప్రాణ స్నేహితుడినైనా సంపాదించు.




# ధర్మం

సేకరణ: సి.హెచ్.సందీప్, 7 వతరగతి, తేజటాలెంట్‌స్కూల్, కోదాడ, నల్గొండజిల్లా.

మరాఠా సైన్యానికి బాజీరావు పీష్వా సర్వ సైన్యాధ్యక్షుడు. ఓసారి ఆయన యుద్ధంలో విజయం సాధించి తన రాజ్యానికి తిరిగి వస్తున్నాడు.

దారిలో అలసిపోయి ఓ చోట శిబిరం ఏర్పాటుచేసుకున్నాడు. అయితే అది ఊరికి చాలా దూరంగా ఉన్న ప్రాంతం- తినడానికి తెచ్చుకున్న సామాన్లన్నీ అయిపోయాయి. సైనికులకు ఆకలి వేస్తున్నది. "దగ్గరలో ఏదైనా తోటలో పండ్లు కోసుకుని రండి- అయితే దౌర్జన్యంగా కాదు- యజమాని సమ్మతితో కోసుకురావాలి" చెప్పాడు పీష్వా.

కొందరు సైనికులు పళ్లకోసం బయలుదేరారు. దగ్గరలోనే ఓ పెద్ద పండ్ల తోట కనబడింది. నిండ పండ్లతో భలే ఉంది ఆ తోట. అ తోటలో ఒక రైతుకూడా కనిపించాడు వాళ్లకు.

సైనికులు అతని వద్దకు వెళ్ళారు; విషయం చెప్పారు.

"ఓహో! పీష్వా బాజీరావు మా ఊరికి వచ్చాడా!" అన్నాడు రైతు సంతోషంగా. "రండి రండి! మీకు ఒక మంచి పండ్ల తోట చూపిస్తాను. అందరూ పళ్ళు కోసుకొని తిందురు, రండి రండి" అని వెంట తీసుకువెళ్లాడు.

కొంతదూరం వెళ్ళాక అతను ఓ చిన్న తోటను చూపించాడు. "దీనిలో పండ్లు కోసుకోండి" అన్నాడు. ఆ తోట చిన్నదిగా ఉంది; అందులో వీళ్ళకు సరిపడా పళ్ళు ఉన్నాయి; కానీ అది ముందు చూసిన తోటంత బాగా లేదు.

సైనికులకు బాగా కోపం వచ్చింది. "అంత పెద్ద తోటను వదిలి దీన్ని చూపిస్తావా?" అన్నారు. "ఇంకెవరిదో తోటను మాకు చూపించి, నీ తోటను మటుకు నువ్వు కాపాడుకుందామనుకున్నావు కదూ?" అంటూ అతడిని పీష్వా దగ్గరకు తీసుకువెళ్లారు.

సైనికుల ద్వారా విషయం తెలుసుకున్న పీష్వా "ఎందుకిలా చేశారు?" అని అడిగాడు అతన్ని, మర్యాదగా.

'ప్రభూ...సైనికులు నన్ను కలిసిన తోట నాదికాదు. నాది కానిదాన్ని దానం చేసే హక్కు నాకు ఎక్కడ ఉంటుంది? ఇక రెండోసారి చూపించింది నాదే- అందుకే ఆ తోటలోని పళ్ళు కోసుకొమ్మని చెప్పాను. అదే కదా ధర్మం?" అన్నాడు రైతు, ధైర్యంగా.

పీష్వా అతన్ని మెచ్చుకున్నాడు. అతని పంటకు సమానమయిన బంగారాన్నిచ్చి పంపించాడు!

**అప్పు పాఠం!**

టీచర్: వెస్టిండీస్ నుండి మనకు ఏమేం వస్తాయో చెప్పు, రామూ?

రాము: తెలీదు టీచర్!

టీచర్ (ఉత్సాహపరుస్తూ): నీకు తెలుసులే! చక్కెర ఎక్కడినుండి వస్తుంది?

రాము: ప్రక్కవాళ్ళ ఇంట్లో అప్పు తీసుకుంటే వస్తుంది టీచర్!




# జ్ఞానోదయం

*"సోము మొదట్లో చదువులో వెనుకబడ్డా అనంతరం రాకెట్‌లా దూసుకెళ్ళాడు. ఇకనైనా మారండి, మీరూ రాకెట్‌లా దూసుకెళ్ళండి" అని ఓ కథ రాసి పంపారు రియాజుద్దీన్ గారు.. కథ ఎలా ఉందో మీరే చదివి చెప్పాలి..*
*రచన: షేక్ రియాజుద్దీన్ అహమద్, తెలుగు పండితులు, శ్రీ విద్యారణ్య యు.పి.స్కూల్, అనంతపురం.*
*మార్పు చేర్పులు: కొత్తపల్లి.*

రామాపురంలో వ్యవసాయం చేసుకునే కృష్ణయ్యకు ఇద్దరు కొడుకులు- సోము, రాము. ఇద్దరినీ అల్లారుముద్దుగా పెంచాడు కృష్ణయ్య. "నేను ఎలాగూ చదవలేదు; కనీసం వీళ్లన్నా బాగా చదివితే, అంతే చాలు" అని తపనపడేవాడు అతను.

రాము రోజూ బడికి వెళ్ళేవాడు; అయ్యవార్లు చెప్పే పాఠాలను శ్రద్ధగా వినేవాడు; చక్కగా నేర్చుకొని అందరి మన్ననలను పొందేవాడు. సోము తరచు బడికి ఎగనామం పెట్టేవాడు;

అల్లరి చిల్లరిగా తిరిగి, బడి ముగిసే వేళకు ఇంటికి తిరిగి వచ్చేవాడు. అయితే నిజం ఏమిటో రాము ద్వారా తెలిసేది కదా, తండ్రి ఎప్పుడూ సోమును మందలిస్తూ ఉండేవాడు. "మేరెప్పుడూ నన్నే తిడతారు. రాముని మాత్రం ఏమీ అనరు" అని కుళ్ళేవాడు తప్పిస్తే, సోము మటుకు తన దారిని మార్చుకునేవాడు కాదు.

అంతలో "దసరా సెలవుల్ని మీ ఊరిలో గడపదలచుకున్నాం. నేనూ సురేషూ ఇద్దరం వస్తున్నాం" అని హైదరాబాద్‌లో ఉన్న శంకరం బాబాయి ఉత్తరం రాశాడు. శంకరం బాబాయి తెలుగు పండితుడు. ఆయనంటే పిల్లలందరికీ చాలా ఇష్టం. రాము సోములు కూడా బాబాయి రాక కోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూసారు.

చూస్తూండగానే బాబాయీ, సురేష్, ఇద్దరూ రామాపురం చేరుకున్నారు. తన వెంట తెచ్చిన ఆటవస్తువులను , బొమ్మల పుస్తకాలను ఇస్తూ 'ఎలా చదువుతున్నార్రా?' అని అడిగాడు బాబాయి.

"బాగా చదువుతున్నాను బాబాయ్!" చెప్పాడు రాము.

సోము ఏమీ జవాబివ్వకుండా దాటవేశాడు. చురుకైన బాబాయి ఆ సంగతిని గమనించాడు. "ఏంటి వీడి కథ?" అని కృష్ణయ్యను అడిగాడు వేరుగా. "ఏం చెప్పమంటావురా, వీడు బడిని ఎగగొట్టి ఎక్కడెక్కడోతిరుగుతున్నాడు. ఏం చెప్పినా వినడు!" తమ్ముడితో బాధని వెలిబుచ్చాడు కృష్ణయ్య.

"నేను చూస్తానులే, వాడిని నువ్వు ఏమీ అనకు కొన్నాళ్ళు" అని శంకరం అన్నను సముదాయించాడు. ఆ రోజునుండీ శంకరం బాబాయి సోముని జాగ్రత్తగా గమనించటం మొదలుపెట్టాడు.

సోము కూడా చురుకైనవాడే. బాబాయి చెప్పే పద్యాలను రాము ఎంత వేగంగా నేర్చేసుకునేవాడో, సోము కూడా అంతే వేగంగా నేర్చుకునేవాడు. అయితే అలా నేర్చుకున్న పద్యాలను రాయమంటే మటుకు వాడు ముడుచుకు పోతాడు! అక్కడినుండి

తప్పించుకొని దూరం పోయేందుకు ప్రయత్నిస్తాడు!

"ఎందుకురా, నీకు రాయటం అంటే ఇష్టం ఉండదా?" అడిగాడు బాబాయి సోముని.

"ఉహుం. రాస్తే చేతులు నొప్పులు పుడతాయి. అసలు ఎందుకు, రాసేది?!" అన్నాడు సోము.

బాబాయికి సోము సమస్య అర్థమైంది. "వీడికి రాయటమంటే ఇష్టం లేదు. ఈ సమస్యను మాటలతో పరిష్కరించటం కుదరదు..."

మరునాడు బాబాయి తన సంచీలోంచి కొత్తపల్లి పుస్తకం తీసి చదువుకోవటం మొదలు పెట్టాడు. "ఏంటి బాబాయ్! అంత శ్రద్ధగా చదువుతున్నావ్?" అంటూ దగ్గరికొచ్చిన సోము కొత్తపల్లిలో బొమ్మల్ని చూసి ముచ్చటపడ్డాడు. అందులో తనకు నచ్చిన కథనొకదాన్ని వాడికి చదివి వినిపించాడు బాబాయ్- "ఇదిగో సోమూ! కొత్తపల్లిలో సగం కథలు పిల్లలు రాసినవే- కావాలంటే నువ్వూ ఓ కథ రాసి పంపచ్చు. ఇందులో అచ్చైతే నీ కథని ఎంతమంది పిల్లలు చదువుతారో! కథతోబాటు నీ ఫొటో కూడా అచ్చు వేస్తారు వాళ్ళు!" సోముని ఊరించేందుకు ప్రయత్నించాడు బాబాయి.

సోము ఉత్సాహం చూపలేదు. అంతలో అక్కడికొచ్చిన సురేశ్ కొత్తపల్లిని చూడగానే ఎగిరి గంతేశాడు- "పోయిన సారిది ఉందా, అందులో నేను రాసి పంపిన కథ ఉంది!" అరిచినంత పని చేశాడు. "అవునా! నీ కథ అచ్చైందా?" ఆశ్చర్యంగా అరిచాడు రాము. ఇద్దరూ ఆ సంచికను వెతుక్కునేందుకు పరుగుపెట్టారు.



బాబాయి సోముకేసి చూశాడు. వాడు రాము,

సురేష్ వెళ్ళినవైపుకే చూస్తున్నాడు..! బాబాయి తన చేతిలో ఉన్న కొత్తపల్లి పుస్తకాన్ని అక్కడే వదిలేసి పనిపడ్డట్లు బయటికి వెళ్ళాడు. కొంతసేపటికి వచ్చి చూస్తే అక్కడ కొత్తపల్లీ లేదు; సోము కూడాలేడు!

ఆరోజు రాత్రి బాబాయి పడుకోబోతుండగా సోము బాబాయి దగ్గరకొచ్చి మెల్లగా అడిగాడు- "నేనేదైనా కథ రాస్తే కొత్తపల్లి వాళ్ళు దాన్ని అచ్చు వేస్తారా?" అని.

"ఓ! మా చక్కగా వేస్తారు. ఎందుకెయ్యరు?!" అన్నాడు బాబాయి, నిద్రకు ఉపక్రమిస్తూ.

తెల్లవారి బాబాయి కళ్ళు తెరిచేసరికి ఎదురుగా సురేష్ నిలబడి ఉన్నాడు. వాడి ముఖం వెలిగి పోతున్నది- చేతిలో వాడు క్రొత్తగా రాసిన ఓ కథ, గజిబిజిగా గాలికి అటూ ఇటూ కదులుతున్నది!

"ఎవరికీ చెప్పకు! దీన్ని కొత్తపల్లి వాళ్ళకు పంపించు! వాళ్ళకిది నచ్చుతుందో నచ్చదో..చూడు" అన్నాడు వాడు గుసగుసగా.

బాబాయి కథ చదివి చూశాడు- నిజంగానే అద్భుతమైన కథ! సోము ఇంత చక్కని కథ రాయగలడని ఆనాటివరకూ ఎవ్వరికీ తెలీనే తెలీలేదు!

ఆ తర్వాత కొత్తపల్లిలో వరసగా మూడు నెలల పాటు ప్రతినెలా సోము రాసిన కథలు ప్రచురితమయ్యాయి.

"ఒరేయ్! నీ కథ కొత్తపల్లిలో వచ్చింది! నువ్వే రాసావా దీన్ని!? నిజంగా?!" అని ఇంట్లోవాళ్ళందరూ గందరగోళ పడ్డారు. ఆ హడావిడిలో ఎవ్వరూ గమనించనే లేదు- సోము ఇప్పుడు బడిని ఎగగొట్టటం లేదు! అర్థ వార్షిక పరీక్షల్లోను, వార్షిక పరీక్షల్లోను వాడికి చాలా మంచి మార్కులు-ఎన్నడూ రానన్ని మార్కులు- వచ్చాయి.

"ఒరేయ్! ఇదేంటిరా, ఇట్లా చదివేస్తున్నావు!" అని బళ్ళో టీచర్లందరూ ముచ్చటపడుతున్నారిప్పుడు.

సోము కొత్తపల్లికి కథల మీద కథలు రాసి పంపిస్తున్నాడు.

వేసవి సెలవుల్లో మళ్ళీ రామాపురం వచ్చిన బాబాయి చేతులు పట్టుకొని కృష్ణయ్య-"భలే మాయ చేసావురా! రాయిలాంటి మా సోము నీవల్ల ఇప్పుడు రత్నంగా మారాడు" అన్నాడు.

"కాదు. వాడు ముందునుండీ రత్నమే. 'చదువులు అర్థవంతంగా ఉండాలి' అనేది అందుకనేరా, అన్నయ్యా. 'ఎందుకు చదవాలి, ఎందుకు రాయాలి' అనేది పిల్లలకు ఎప్పటికప్పుడు స్పష్టంగా తెలుస్తూ ఉండాలి.

సోము చాలా చురుకైనవాడసలు. అయితే వాడికి రాయటం ఎందుకో అర్థంకాలేదు. అందుకనే వాడు మొదట్లో అట్లా ఉండిపోయాడు. కథల పుణ్యమా అని, వాడికి ఇప్పుడు రాయటం ఎందుకో అర్థమైంది- అంతే తేడా!" అన్నాడు బాబాయి, తనూ సంతోషపడుతూ. ✷

| | | | | | |
|---|---|---|---|---|---|
| స మ త | కా ను పు | త మ కం | వ ర స | కో వె ల | టో క రా |
| మ జ్జి గ | ను వ్వు లు | మ ర్యా ద | ర వి క | వె న్నె ల | క వ్వ ము |
| త గ ము | పు లు లు | కం ద కం | స క లం | ల ల న | రా ము డు |
| కం చ ము | కా ర ము | పా ల ము | హి మ జ | మ న సు | చ దు వు |
| చ క్కె ర | ర గ డ | ల లి త | మ న ము | న య నం | దు ర ద |
| ము ర ళి | ము డ త | ము త క | జ ము న | సు నం ద | వు ద కం |
| క్షీ ర ము | స మ త | ధ న ము | క వి త | ది న ము | ప్ర దే శం |
| ర వ్వ లు | మ ర ల | న వ్య త | వి న ల | న గ రి | వే ది క |
| ము లు కు | త ల పు | ము త క | త ల క | ము రి కి | శం క రం |

నిలువుగాను, అడ్డంగాను ఎట్లా చదివినా అవే పదాలు వస్తున్నాయి చూడండి!

*('బాల' పత్రికస్ఫూర్తితో తయారీ: రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషీవ్యాలీస్కూలు, మదనపల్లి, చిత్తూరు జిల్లా.)*

# దయ

రచన: రాధమండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.



"అమ్మా! నేను రాముని, శీతలని చూసి వస్తా" అంది చిన్ని రామచిలుక

"సరే జాగ్రత్తగా వెళ్ళిరా" అంది అమ్మ.

మెల్లగా నడుస్తూ వెళుతున్న చిన్ని రామచిలుకని చూసిన బుజ్జి కుక్కపిల్ల "చిన్నీ! ఆగు - ఆగు. ఎక్కడికి, వెళుతున్నావు" అని అడిగింది తల పైకెత్తి చూస్తూ.

"నేను రాముని, శీతలని చూడటానికి వెళుతున్నాను" అంది చిన్నిచిలుక.

"ఓ! జంతువుల షాపు నుండి నిన్ను కాపాడిన పిల్లలు కదూ! ఎంత మంచి పిల్లలో! వాళ్ళని చూడటానికి నేనూ వస్తాను అంది కుక్కపిల్ల.

"సరే!రా!" అంది చిలుక





ఇద్దరూ వెళుతూ వెళుతూ ఉండగా పిల్లి ఎదురు వచ్చింది. "ఏయ్ బుజ్జీ, చిన్నీ- ఎక్కడికెళుతున్నారు?" అని అడిగింది.

"మేము రాముని, శీతలని చూడటానికి వెళుతున్నాము. నువ్వూ రాకూడదూ మాతో?" అన్నాయి అవి.

"ఎందుకు రాను? వాళ్ళిద్దరూ దయగల పిల్లలు. వాళ్ళని చూడాలని ఎన్నాళ్ళగానో అనుకుంటున్నాను. నీ కథ విన్నప్పటి నుండి నీతో ఎన్నోసార్లు చెప్పాను కదా, వాళ్ళని చూడాలని ఉందని!" అంది పిల్లి చిలుకని చూస్తూ.

"అబ్బబ్బ! ఇది వాగుడుపిల్లి. పదపద మాట్లాడకుండా" అంది బుజ్జి కుక్కపిల్ల విసుక్కుంటూ.



ముగ్గురూ వెళుతూ వెళుతూ ఉండగా చెట్టు మీద కూర్చుని పాటలు పాడుకుంటున్న కోకిల వీరిని చూసి పాట ఆపి "ఓ బుజ్జీ, చిన్నీ-

ఎక్కడికెళుతున్నారు, ఈ వాగుడు పిల్లిని తీసుకొని?" అంది. దాని మాటలకు పిల్లి మూతి ముడుచుకుంది.

"చిన్నిని కాపాడేరే, ఇద్దరు పిల్లలు- రాము, శీతల! - వాళ్ళని చూడటానికి వెళుతున్నాం!" అంది కుక్కపిల్ల.

"అయితే నేనూ వస్తా!" అంది కోకిల.



నలుగురూ వెళుతూ వెళుతూ ఉండగా ఏమీ తోచక అటూ ఇటూ అనవసరంగా గంతులు వేస్తున్న కోతి వీరిని చూసి వాళ్ళ దగ్గరకు పరిగెత్తుకు వచ్చి "ఎక్కడికెళుతున్నారు? నాకేమీ తోచడం లేదు. నేనూ మీతో వస్తా" అంది గబగబా, ఎక్కడికెళుతున్నారో కూడా తెలుసుకోకుండా.

"మేము బావిలో దూకడానికి వెళుతున్నాం అనుకో - వస్తావా? అరే - 'ఎక్కడికెళుతున్నారు - ఏమిటి కథ' అనికూడా అడగకుండా వస్తుందట- వస్తుంది!" అంది పిల్లి, వాగడానికి ఛాన్స్ దొరికింది కదా అని.

"హుష్! ఊరుకో, ఏమిటా మాటలు?!" అంది కోకిల, పిల్లిని పక్కకి లాగుతూ.

"మేము రాముని, శీతలని చూడటానికి వెళుతున్నాము!" అంది చిన్ని చిలుక.



"ఓ! నిన్ను ఆ మాయదారి అంగడి - జంతువులని అమ్మే అంగడి నుండి కాపాడి, 'అమ్మ దగ్గరకు పో' అని చెప్పిన పిల్లలా? నేను కూడా వస్తా - నేను కూడా వస్తా!" అంటూ మళ్ళీ గంతులు వేయసాగింది ఉత్సాహంగా.

అవి తిన్నగా, జాగ్రత్తగా రాము, శీతల ఇంటికి వెళ్ళాయి.

వీటిని చూసిన రాము,శీతల వాటికి పండ్లూ, పాలూ పెట్టారు- అవన్నీ తమని చూడటానికి వచ్చాయని తెలియక పోయినా!!!!

నవ్వు!

**అతితెలివి భక్తి!**

భక్తుడు: దేవుడా! మాకు వేలకోట్ల సంవత్సరాల కాలం నీకు ఎంతతో సమానం?

దేవుడు: మీ వేలకోట్ల సంవత్సరాలూ నాకు ఒక్క నిముషంతో సమానం.

భక్తుడు: దేవుడా! మా వేలకోట్ల రూపాయలు నీకు ఎంతతో సమానం?

దేవుడు: నాయనా, మీ వేల కోట్ల రూపాయలూ నాకు ఒక్క పైసాతో సమానం.

భక్తుడు: అయితే దేవుడా! నాకు ఒక పైసా దానం చెయ్యి!

దేవుడు(అంతర్ధానం అయిపోతూ): అలాగే నాయనా, ఓ నిమిషం ఆగు!



# చిల్లికుండ కథ

సేకరణ: శ్రీమతి.నాగలక్ష్మి, ఉపాధ్యాయురాలు, కెయస్ఆర్‌ప్రభుత్వ బాలికోన్నత పాఠశాల, అనంతపురం.

శాంతిపురంలో యతీంద్ర అనే ధనవంతుడు ఒకడు ఉండేవాడు. అతని ఇంట్లో వీరయ్య అనే పనివాడు ఉండేవాడు. ప్రతిరోజు ఉదయం చెరువుకు వెళ్ళి కావడిలో రెండు కుండలు పెట్టుకొని నీళ్ళు తెచ్చేవాడు. ఆ తర్వాత పశువుల పేడ ఎత్తడం, తోటకు వెళ్ళడం- ఇలా మిగతా పనులన్నీ చేసేవాడు. కావడిలో ఒక కుండకు చిన్న చిన్న రంధ్రాలు పడి ఉన్నై. మరో కుండ బాగా ఉన్నది.

చెరువు నుంచి యజమాని ఇంటికి చేరేలోగా మొదటి కుండలోని నీళ్ళు సగం పైన చుక్కలు చుక్కలుగా రంధ్రాలలోంచి కారిపోయేవి. రెండో కుండ మాత్రం నిండుగా ఇల్లు చేరేది.

ఇలా కొంతకాలం గడిచాక, నిండు కుండ రంధ్రాలుపడిన కుండతో అన్నది: "నన్ను ఏ

పనికైతే నియోగించారో, దాన్ని నేను సక్రమంగా నిర్వర్తిస్తున్నాను. కాని నువ్వు సగం నీటిని దారిలో పారపోస్తున్నావు- నీ యజమాని పట్ల విధేయత లేదు, నీకు" అని.

ఆ రోజున వీరయ్య కావడి కుండల్ని చెరువులో ముంచుతూండగా రంధ్రాలుపడిన కుండ అతనితో మాట్లాడింది: "నాకు చాలా సిగ్గుగా ఉంది వీరయ్యా! నాకు నియోగించిన పనిని నేను సక్రమంగా చేయలేకపోతున్నాను. ఈ చిల్లుల కారణంగా నీళ్లన్నీ దారిలోనే కారిపోతున్నాయి" అన్నది.

వీరయ్య ఏమీ మాట్లాడకుండా కావడినెత్తుకొని నడక సాగించాడు. మధ్య దారిలో కావడిని క్రిందికి దించి, రంధ్రాలు పడిన కుండని అడిగాడు- "నీకు బయట ఏం కనిపిస్తున్నాయి?" అని. "అందమైన పూలచెట్లు కనిపిస్తున్నాయి" అన్నది చిల్లి కుండ. "మరి నీకు ఏం కనిపిస్తున్నాయి?" అని నిండు కుండను అడిగాడు వీరయ్య. "బీడు భూముల్లో ఏముంటాయి, ఏమీ లేవు!" అన్నది నిండుకుండ.

వీరయ్య నవ్వి, వాటితో అన్నాడు- "చిల్లికుండలోంచి చిందిన నీరు ఆ పూల చెట్ల జీవితాలకు ఆధారమైంది. అందువల్లనే నేను దాన్ని మార్చడం లేదు! నిండు కుండ యజమానికి సేవ చేస్తున్నట్లే, చిల్లికుండ ఆ చెట్లకు ప్రాణాన్నిచ్చి యజమానికి ఇంత పుణ్యం సంపాదించి పెడుతున్నది. ఈ రెండింటిలోనూ ఎవరు గొప్ప అంటే ఏం చెప్పగలం?" అని.

## ఎవరు కొత్త?

జోకు!

ఇద్దరు తాగుబోతులు రోడ్డుమీద ఇట్లా మాట్లాడుకుంటున్నారు:

గోపాల్: చూడు బ్రదర్, ఆకాశంలో ఉండేది చంద్రుడో, సూర్యుడో అర్థంకావట్లేదు- కాస్త చూసి చెబుతావా?

నరేష్: నాకెట్లా తెలుస్తుంది? నేనసలే ఈ ఊరికి కొత్త! అయినా ఇంతకాలంగా ఊళ్ళో ఉన్నావు- నువ్వు నన్నడగడమేమిటో!



# చిన్నమ్మ - పెద్దమ్మ

*సంపద ఉన్న చోటే దరిద్రం కూడా ఉంటుంది. లేకపోతే మన పట్టణాల్లోని మురికివాడలు ఎందుకుంటాయి..?*
*రచన: నారాయణ, కొత్తపల్లి బృందం.*

శ్రీపతికి భక్తి ఎక్కువ; ఆశకూడా ఎక్కువే. ఏదో ఒక రోజు తన అదృష్టం తన్నుకొని వస్తుందని ఎదురు చూస్తూ ఉండేవాడతను. ఇంట్లో చాలా మంది దేవతల ఫోటోలు ఉండేవి, రోజూ వాటిలో తనకు గుర్తొచ్చిన వాళ్లకల్లా పూజలు చేసి హారతులిస్తూ ఉండేవాడు శ్రీపతి. అలా పూజ చేసినప్పుడల్లా ఆ దేవుళ్లకు తప్పకుండా చెప్పేవాడు: "స్వామీ! తల్లీ! మాతా! మా యింటికి రండి! ఒక్కళ్ళే రాకండి- సపరివారసమేతంగా విచ్చేయండి. ఇక్కడే ఉండిపోండి! ఇది మీ ఇల్లే అనుకోండి! నన్ను కటాక్షించండి,... " ఇలా సాగేది అతని స్తోత్రం. ఆ రోజు శ్రీపతి ఒక్కడే ఉన్నాడు ఇంట్లో. బయట వాన

కురుస్తున్నది. చలి కూడా చాలా ఎక్కువే ఉన్నది. శ్రీపతి పడక్కుర్చీలో కూర్చొని కునికి పాట్లు పడుతున్నాడు. ఆ సమయంలో ఎవరో తలుపు తట్టినట్లు అయ్యింది.



శ్రీపతి వెళ్లి తలుపుతీశాడు. ఎవరో చాలా చక్కని యువతి నిలబడి ఉన్నది బయట! బంగారం రంగులో ధగధగా మెరిసిపోతున్నది. ఎన్నడూ కనీ-వినీ ఎరుగని నగలు ధరించి ఉన్నది.

"ఎవరమ్మా నువ్వు?" అడిగాడు శ్రీపతి. "రోజూ పూజ చేస్తున్నావు కదా, గుర్తు పట్టలేదా?" అన్నదామె.

శ్రీపతి నిర్ఘాంత పోయాడు-

"నేను, లక్ష్మీదేవిని!" అన్నదామె, తనని తాను పరిచయం చేసుకుంటున్నట్లు. "సంపదల తల్లీ! రా! నా యింట్లోనే ఉండిపో" అని అంతగా ప్రార్థించావుగా? అందుకనే వొచ్చా" అన్నది చిరునవ్వుతో.

"అయ్యో ! తల్లీ! రామ్మా! రా! ఇన్నాళ్లకు కరుణించావా?! రా, తల్లీ! కూర్చో! ఒక్కతెవే వచ్చావా?" అని హడావిడి పడ్డాడు శ్రీపతి.

సంపదల తల్లి మాట్లాడకుండా లోపలికొచ్చి అటూ ఇటూ చూడటం మొదలు పెట్టింది. శ్రీపతి ఆ తల్లికి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చి "తర్వాత పాలు ఇవ్వాలా, టీ ఇవ్వాలా?" అని కంగారు పడటం మొదలు పెట్టాడు. కొంచెం సేపటికి మళ్లీ ఎవరో తలుపు తట్టినట్లు అయ్యింది-

"ఈ సారి ఎవరొచ్చారో!" అని సంబరంగా వెళ్లి తలుపు తీశాడుశ్రీపతి.

ఎవరో బిచ్చగత్తె- మాసిపోయి, చిరుగులు పడ్డ చీరతో , రేగిపోయిన జుట్టుతో, ముడతలు పడిన చర్మంతో - చాలా వికారంగా ఉంది-

"నీ ఇంట్లోనే ఉండిపోదామని వొచ్చాం. రానియ్యి లోపలికి!" అంటోంది.

"ఆగాగు - ఎవర్నువ్వు? నిన్ను నేనెందుకు పిలిచాను?! ఎవర్ని చూసి ఎవరనుకుంటున్నావో!" అడ్డుకున్నాడు శ్రీపతి.

"మా చెల్లి వచ్చిందిగా ఇక్కడికి?! నువ్వు సకుటుంబంగా రమ్మన్నావని చెబితే ఇద్దరం బయలు దేరి వచ్చాం. నేను దరిద్ర దేవతను, రానియ్యి నన్ను, లోపలికి !" అన్నదామె. శ్రీపతిని ప్రక్కకు నెడుతూ.

"ఆగు! తల్లీ! ఆగు! నేను లక్ష్మిని ఒక్కదాన్నే రమ్మన్నాను, ఆమె కావాలంటే విష్ణువును వెంటబెట్టుకొని రావచ్చు! నువ్వు మాత్రం నా యింట కాలు పెట్టేందుకు వీల్లేదు తల్లీ, పోమ్మా పో!" అని ఆమెను అటునుండి అటే సాగనంపాడు శ్రీపతి.




ఆవిడ అటుపోగానే ఇటు లక్ష్మీదేవి కూడా బయలు దేరింది- "మా అక్కా-నేనూ ఎప్పటికీ కలిసే ఉంటామని ఒట్టు పెట్టుకున్నాం. అయినా నువ్వేంటి, అందరినీ తీసుకు రమ్మని, తీరా తీసుకొచ్చాక ఇలా అవమానిస్తున్నావు?" అని మాయం అయిపోయింది కోపంగా. ✷




# దానం

*కథనం: నారాయణ, కొత్తపల్లిబృందం.*

బుద్ధుడు ఇంకా జీవించి ఉన్న సమయంలో శ్రావస్తీ నగరంలో సుదత్తుడు అనే పెద్ద వ్యాపారి ఒకడు ఉండేవాడు. ఆ సమయంలో బుద్ధుని ఖ్యాతి దేశపు నలుమూలలా మారు-మ్రోగుతూ ఉండేది. స్వతహాగా మంచివాడు, దానశీలి అయిన సుదత్తుడు కూడా ఆయన బోధనలు విని, ఆయన పట్ల ఆకర్షితుడైనాడు.

సుదత్తుడికి "అనాధపిండకుడు" అని పేరు ఉండేది. 'నా' అన్నవాళ్లు లేని అనేకమందికి దయతో జీవనాధారాలు, భోజన సదుపాయాలు కల్పించటం వల్ల అతనికి ఆ పేరు కలిగింది. అట్లాంటి అనాధ పిండకుడికి ఒకసారి తెలిసింది- బుద్ధభగవానుడు శ్రావస్తి పరిసరాల్లోనే ఉన్నాడు. తను ఆహ్వానిస్తే శ్రావస్తికి కూడా రావచ్చు!

వెంటనే అతను బయలుదేరి వెళ్లి బుద్ధుడిని తమ నగరానికి రావలసిందిగా ఆహ్వానించి వచ్చాడు. ఆ సమయంలో బుద్ధుని వెంట 1,250 మంది బిక్షువులు కూడా ఉండేవాళ్లు. వాళ్లందరూ కూడా బుద్ధుడు ఎటు వెళ్తే అటు వెళ్తూ ఉండేవాళ్లు. వీళ్లంతా శ్రావస్తిలో బసచేసేందుకు తగినంత పెద్ద స్థలం కావల్సి ఉండింది. అంతేకాక బుద్ధుడి ప్రవచనాలు వినేందుకు లక్షలాది మంది సాధారణ ప్రజలు కూడా రావచ్చును- ఆ స్థలం వారందికీ సరిపోవాలి!

మరి, భిక్షువులు అందరికీ సౌకర్యంగా ఉండాలంటే, అది జనసమ్మర్దం ఉన్న ప్రదేశంలో ఉండకూడదు. అట్లా అని జనవాసాలకు దూరంగా కూడా ఉండకూడదు- అందరూ వచ్చి వెళ్లాలి గదా!

'అట్లాంటి చక్కని ప్రదేశం ఏది ?' అని వెతికాడు అనాథపిండకుడు. ఊరి చివరలో ఉన్న 'జేతవనం' అన్ని రకాలుగాను సరిపోతుంది ' అనిపించింది. నిండుగా రకరకాల పండ్ల చెట్లు కళకళలాడే జేతవనంలో భగవానుడికి కావలసినంత నీడ కూడా లభిస్తుంది! అయితే సమస్యల్లా, ఆ వనం శ్రావస్తీ నగర రాజకుమారుడు జేతుడి ఉద్యానవనం- దానిలోకి అందరికీ ప్రవేశం ఉండదు!

అనాథపిండకుడు ఈ విషయమై జేతుడిని కలిసి, "నీ జేతవనం కొనేస్తాను, అమ్ముతావా? ఎంత ధరకు?" అని అడిగేశాడు. జేతుడికి ఉద్యానవనాలు అమ్మవలసిన అవసరం లేదు. అదీగాక అతను రాజకుమారుడు- భావి రాజు కూడాను! అట్లాంటి వాడు, ఊరికే ఉద్యానాలు ఎందుకు అమ్ముతాడు? "లేదు లేదు! అసలు అమ్మేది లేదు " అన్నాడు జేతుడు. కానీ అనాథపిండకుడు పట్టువిడువక, "ఏదో , నేను కొంటానన్నాను కదా, అమ్మితే నీకేమి? ఎంత డబ్బు కావాలో చెప్పు! ఎంత ఇమ్మన్నా ఇస్తాను" అన్నాడు జేతుడితో.

"ఓహో! ఎంత ఇమ్మన్నా ఇస్తావా?" అన్నాడు జేతుడు వెటకారంగా.

"ఇస్తాను, నువ్వు అడిగి చూడు!" అన్నాడు అనాథపిండకుడు.

"జేతవనంలో ఎంత భాగం మీదకి నువ్వు బంగారం పరచగలవో చూడు. ఎంత భాగంలో బంగారం పరిస్తే అంత నేలను నీకిస్తాను" అన్నాడు జేతుడు, నవ్వుతూ, ఎగతాళిగా.



అనాథపిండకుడు నవ్వలేదు.

"ఏంటి, బాధపడుతున్నావా? కోపపడకు. నాకు ఆ వనాన్ని అమ్ముదామని లేదు అసలు!" అన్నాడు జేతుడు నవ్వుతూ.

"కాదు- 'ఏ గోదాములో ఉన్న బంగారం తెప్పించాలా' అని ఆలోచిస్తున్నాను" అన్నాడు అనాథపిండకుడు.

మరునాడు, జేత రాకుమారుడు వ్యాహ్యాళికి వెళ్లేసరికి అక్కడ వందలాది బళ్లలో బంగారం వచ్చి ఉన్నది. పనివాళ్లు వనమంతటా బంగారం పరుస్తున్నారు! ఇంకా ఇంకా బళ్లు వస్తున్నాయి, నిండా బంగారంతో! ఖాళీ అయినవి తిరిగి పోతున్నాయి! చివరికి తోటలోని నేల మొత్తం బంగారంతో కప్పబడింది. పండ్ల చెట్లు నిలచి ఉన్న స్థలాల్లో తప్పిస్తే, మిగతా తోటలో నేల అన్నది కనబడకుండా అయ్యింది!

తను నవ్వులాటకి అన్న మాటని అనాథపిండకుడు అంత గట్టిగా తీసుకునే సరికి జేతుడికి ఆశ్చర్యం వేసింది. దాంతో బాటు "ఈ బుద్ధుడెవరో, నిజంగా అసాధారణమైన వ్యక్తి అయిఉండాలి. లేకపోతే ఎవరైనా నేలను బంగారంతో కొలిచి ఎందుకు కొంటారు? అలా కొన్నదాన్ని అతనికి దానంగా ఎందుకు ఇచ్చేస్తారు?'

అనిపించింది అతనికి.

తరువాత బుద్ధుడిని కనులారా చూసి, ఆయన చెప్పిన సంగతులు విన్నాక, అనాథపిండకుడు తను కొన్న స్థలాన్నంతా బుద్ధ సంఘానికి దానం చేసినప్పుడు, జేతుడు తన వంతుగా చెట్ల మొదళ్లున్న స్థలాన్ని బుద్ధుడికి ఇచ్చేశాడు.

అటు తర్వాత ఆ వనంలో బుద్ధుడు పంథొమ్మిది వర్షాకాలాలు గడిపాడు. తన జీవితంలో అధిక భాగం ప్రవచనాలను బుద్ధుడు ఈ వనం నుండే ఇచ్చినట్లు తెలుస్తున్నది.

జేత - అనాథపిండకులిద్దరూ పూర్తిగా నిస్వార్థంగా, పరిపూర్ణ హృదయాలతో దానం చేయటం వల్లనే ఆ వనానికి అంతటి సౌభాగ్యం కలిగిందని చెబుతారు.

కవిత

**పుష్ప విలాపం!**

నల్లని జడలో అందంగా అలంకరించిన పువ్వులను చూడు
ఎంతో అందంగా తొందరగా మనసుని ఆకర్షిస్తున్నాయి.
కానీ పైకి అందంగా ఉన్నా ఆ పువ్వుల మనసులో బాధ ఉంది.
ఆ బాధ పాపం ఎవరికి చెప్పుకుంటాయి ఆ పువ్వులు
పుట్టీ పుట్టగానే ఆ పువ్వుని తల్లి నుండి దూరం చేశారు,
తల్లిప్రేమ అనుభవించక ఎంత దు:ఖిస్తున్నాయో ఆ
బాధ వాటికే తెలుసు, కావున పూగుత్తులు కోసే మిత్రమా
వాటి మనసు తెలుసుకొని మసలుకో.

*రచన: సి.కృష్ణవేణి, 9వతరగతి, ప్రకృతిబడి.*






# సైన్సా..? మహిమా..?

రచన: యస్. శంకరశివరావు, ఇంద్రజాలికులు/ఉపాధ్యాయులు, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, భద్రాపురం, కనగానపల్లి మండలం, అనంతపురం జిల్లా.

ముదిగుబ్బ గ్రామ శివార్లలో పెద్ద వేపచెట్టు ఒకటి ఉంది. ఆ చెట్టుకింద పురాతనమైన పెద్దమ్మ దేవత గుడి. శివరాత్రి రోజున జాగారాలు అయిన తరువాత పెద్దమ్మ తల్లికి దేవరపోతును బలి ఇస్తారు. తరతరాలుగా జరుగుతున్న 'పెద్దమ్మ పరుష' దాంతో మళ్ళీ ఓ సారి మొదలవుతుంది. ఆ సమయంలో వరాలు అడగటంకోసం చాలామంది ఆడవాళ్ళు గుడిముందు నిలబడి వుంటారు. అక్కడున్నవాళ్ళు వాళ్ళ తలల మీద బిందెలతో నీళ్ళు పోస్తుంటారు.

ఎప్పటిలాగే ఓ కోడిపుంజును తీసుకొని, కూతురు వెన్నెలతో పెద్దమ్మ పరుషకు వెళ్ళాడు రాముడు. పూజారప్ప దేవర పోతును బలి

ఇచ్చాక, ఎవరికి వాళ్ళు మేకల్ని, పొట్టేళ్ళను, కోళ్ళను, బలులు ఇచ్చారు. ఆ మాంసాల్ని కాల్చడానికని అక్కడే ఓ అగ్నిగుండం ఏర్పాటు చేశారు. దానిలో నిప్పులు కణకణలాడుతూ మండుతున్నాయి. అందులో వేస్తున్న మాంసాల వాసన ఆ ప్రాంతం అంతా వ్యాపించి ఉన్నది.

రాముడి కూతురు వెన్నెల అక్కడే ఓ ప్రక్కగా నిలబడింది. పరుషలో జరుగుతున్న తంతుల్ని వివరంగా గమనిస్తున్నది. అక్కడ వరాలు అడగడానికి నిలబడ్డ ఆడవాళ్ళు ఆ పాప దృష్టిని ఆకర్షించారు. ఇంతలో ఏమైందో, వాళ్లలో ఒకామె వేపమండలు చేతపట్టుకొని, పెద్దగా అరుస్తూ గంతులు వేయటం మొదలు పెట్టింది. అక్కడికి పరుగున వచ్చిన డప్పులవాళ్ళు 'జజ్జనక' అని దరువులు వేయసాగారు. ఆ దరువుల వెంబడి ఆమె ఏదో మత్తులో ఉన్నట్లు అటూ ఇటూ ఊగిపోవటం మొదలు పెట్టింది. "ఏమైంది నాన్నా, ఆమెకు?" అని అడిగింది వెన్నెల. "పెద్దమ్మ పూనింది తల్లీ! ఆమె శరీరం ఇప్పుడు పెద్దమ్మకు ఆశ్రయం అయిపోయింది. ఆమె ద్వారా పెద్దమ్మ పలుకుతుంది ఇప్పుడు" అన్నాడు రాముడు, భక్తితో కళ్ళు మూసుకుంటూ. ఆ పెద్దమ్మ పూనిన తల్లి ఇప్పుడు గబగబా నిప్పులున్న వైపుకు పరుగు పెట్టింది.



జనాలందరూ గందరగోళంగా తప్పుకున్నారు; పెద్దమ్మ తల్లికి దారి ఇచ్చారు. ఆమె పరుగున పోయి నిప్పుల్లో అటూఇటూ నడవడం మొదలు పెట్టింది! వెన్నెల నివ్వెరపోయింది. చుట్టూ ఉన్న వాళ్లంతా పెద్దమ్మ మహిమను గుర్తుచేసుకోవటం మొదలు పెట్టారు.

వందలాదిమంది ఆమె కాళ్ళపై పడి మొక్కేందుకు తొక్కిసలాడారు. ఆమె కాళ్ళు దొరికించుకొని మరీ మొక్కుతున్నారు జనాలు. కొంత సేపటికి ఆమె గట్టిగా అరుస్తూ గిరగిరా తిరిగి కింద పడిపోయింది. జనాలందరూ ఆమెను పైకి లేపి, పెద్దమ్మ తల్లి విగ్రహం ఎదుట పడుకోబెట్టారు.

దాన్నంతా కన్నార్పకుండా చూసింది వెన్నెల. రాముడు ఆమె దగ్గరగానే ఉన్నాడు గానీ, ఈ లోకంలో ఉన్నట్లు లేడు. తండ్రికి తెలివి వచ్చాక, వెన్నెల అడిగింది- "నిప్పుల్లో దిగితే కాలదా, నాన్నా?!" అని.

"పెద్దమ్మ తల్లి పూనితే నిప్పులు-గిప్పులు ఏం చేయవమ్మా!" చెప్పాడు తండ్రి.

ఆ ప్రక్కనే నిలబడి వీరి సంభాషణను వింటున్నాడు 'డౌను'. డౌను అన్న అంటే చుట్టు ప్రక్కల వూర్లోని విద్యార్థులకు చాలా గౌరవం. వెన్నెల సందేహం తీర్చాలనుకున్నాడు డౌను. "వెన్నెలా! ఇటురామ్మా, నీ సందేహం తీరుస్తాను" అని పిలిచాడు. వెన్నెల డౌను దగ్గర కెళ్ళి నిలబడింది.

డౌను చెప్పసాగాడు- "చూడమ్మా! అమాయక జనం చూస్తే భయపడతారు గానీ, నిజానికి నిప్పులలోంచి నడవటం ఏమంత కష్టం కాదు. ఇందులో ఏ మహిమా లేదు- ఉన్నది సైన్సే.

నిప్పులలోంచి నడవాలంటే ముందు కాళ్ళు బాగా కడుక్కోవాలి. నిప్పుల పైన బూడిద, రాళ్ళు, మేకులు లేకుండా చూడాలి. అట్లా అవి కణకణా మండుతున్నప్పుడు వాటిమీదినుండి గబగబా నడిస్తే- కాళ్ళు కాలవు! నిజం!

అయితే అందుకుగాను కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. ఒక విడతలో నిప్పులమీద కేవలం మూడు- లేదా నాలుగు అడుగులు మాత్రమే పడే విధంగా చూసుకొని నడవాలి. నిప్పులమీద నడుస్తూ ఎక్కడా ఆగిపోకూడదు- మూడు సెకన్ల కంటే ఎక్కువ సేపు కాళ్ళను నిప్పులమీద ఎక్కడా నిలపకుండా నడవాలి.

ఇందులో మహాత్యం ఏమీ లేదమ్మా, ఇది

కేవలం మన చర్మానికున్న లక్షణం: శరీరాన్ని కాగడాలతో కాల్చుకున్నాకూడా, ఆ మంట మూడు సెకన్లకంటే తక్కువ సేపే గనక మన చర్మాన్ని తగిలితే, మనకు ఏమీ కాదు- మన చర్మం కాలదు. అయితే మూడు సెకన్ల కంటే ఎక్కువసేపు ఒకే చోట కాల్చకూడదు!

దీనికి కొంత సాధన అవసరం. నువ్వు గమనించావోలేదో- ఇందాక ఒకావిడ నిప్పుల్లో నడచింది గదా, ఆమె నీళ్ళలో వరసగా తడుస్తూనే వుంది. ఆమె కాళ్ళకు బాగా బురద కూడా అంటుకుని ఉంది. ఎక్కువ తేమ, మట్టి చేరే సరికి కాళ్ళు మొద్దుబారి వున్నాయి. అదీగాక ఆమె నిప్పులమీదుగా గబగబా నడిచింది తప్పిస్తే, ఎక్కడా నిలబడలేదు. అందుకనే, ఆమె కాళ్ళు అసలు కాలలేదు. అర్థమైంది గదా, ఈ పని ఎవరైనా చేయచ్చు- పెద్దమ్మ పూనవలసిన అవసరం అసలు ఎంతమాత్రమూ లేదు!" అన్నాడు గట్టిగా.

డౌసు చెబుతుంటే చుట్టూ ఉన్నవాళ్ళు వింతగా విన్నారు. 'ఎవరు వీడు, పెద్దమ్మనే అవమానిస్తున్నాడు' అన్నట్లు అపనమ్మకంగా చూశారు. వాళ్ళలో ఒకడు వెన్నెల కంటే ముందు అడిగాడు- "ఊరికే చెప్పటం కాదు డౌసూ, చేతనైతే నువ్వూ నిప్పుల్లోంచి నడిచి చూపించు! పెద్దమ్మ తల్లి దయ లేకుండానువ్వు నిప్పుల్లోంచి ఎలా బయటికొస్తావో మేమూ చూస్తాంగా?!" అన్నాడు.

అంతే- మరుక్షణం ఎవరూ ఊహించని విధంగా డౌసు నిప్పుల దగ్గరికి వెళ్ళాడు. బక్కెట్టులో నీళ్ళు కాళ్లమీద కుమ్మరించుకున్నాడు. నవ్వుతూ నిప్పుల్లోంచి నడచి వెళ్ళాడు! చుట్టూ చేరినవాళ్లకు నోట మాట రాలేదు.

డౌసు నిప్పుల్లోంచి నడిచి బయటికి రాగానే జనాలందరూ అతని చుట్టుతా మూగారు. అతని కాళ్ళను పరీక్షించారు. "నిజంగా నడవొచ్చా, మేమూనూ?" అని అడిగారు. "ఓఁ, ఎవరైనా నడవచ్చు. ఇది సైన్సే! మహిమ కాదు" అన్నాడు డౌసు.

అక్కడే నిలబడి డౌసు చెబుతున్నదంతా

వింటున్న మరొక అతను ముందుకు వెళ్ళాడు. కాళ్ళమీద నీళ్ళు కుమ్మరించుకొని, ధైర్యంగా నిప్పులమీదినుండి నడిచి వచ్చాడు! అతన్ని చూసి మరొకళ్ళు..మళ్ళీ ఒకళ్ళు! అందరూ ఎవరికి వాళ్ళు డాసు చెప్పిన రహస్యాన్ని పరీక్షించి చూసుకున్నారు.

జనం అందర్నీ మెచ్చుకుంటూ చప్పట్లుచరిచారు. రాముడు మాత్రం వెన్నెల వెనక నిలబడి, ఆ పాప నిప్పులలోకి పోకుండా పట్టుకున్నాడు!

"కంగ్రాట్స్ అన్నయ్యా! భలే రహస్యం చెప్పావు ఈ రోజు!" అంది వెన్నెల డాసును మెచ్చుకుంటూ.

నేను కొన్నాను ఒక "టికెట్"
చూడడానికి "క్రికెట్"
నేను లాక్కున్నాను ఒక "వికెట్"
దాన్ని అమ్మికొన్నాను ఒక "బకెట్"

**ప్రాస కవిత్వం!**

*కె.శరత్‌చంద్రిక, 7వతరగతి, శ్రీసాయినాథ్ స్కూలు, పొదలకూరు, నెల్లూరు.*

నాపేరు "మీన"
తెచ్చాను ఒక నీళ్ళ "బాన"
దాన్ని పెట్టాను "నేలపైన"
దీనిపై వాలింది "మైన"
గానం చేసింది ఆ "పైన"
గానం అర్థమైందా "ఇప్పటికైన"

ఒరేయ్ "బాసు"
ఏమి అట్లా పెట్టావు "ఫేసు"
బిజినెస్‌లో వచ్చిందా "లాసు"
దీపావళికి పేలుస్తావా "టపాసు"

# పదరంగం-17

*ఈ పదరంగం చాలా సులభం! దీన్ని ఓ పోస్టు కార్డులో పూరించి పంపండి. మీ పేరుతో బాటు మీ బడి పేరు, తరగతి తప్పక రాయండి. సరైన సమాధానాలు పంపిన పిల్లల పేర్లను పదరంగం-18 తోపాటు ప్రచురించగలం.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | 4 |
| | ■ | | ■ | 5 | |
| 6 | | | 7 | ■ | |
| | ■ | 8 | | 9 | ■ |
| ■ | 10 | ■ | 11 | | 12 |
| 13 | | | | ■ | |

**ఆధారాలు: నిలువు**

1. ఆకాశంలోంచి పడే మంచు గడ్డలు (4)
2. 8అడ్డంతో ఓ మనిషిపేరు- తలక్రిందులుగా(4)
3. ఫుల్‌స్టాప్ కాదు (2)
4. వానలు కురవాలంటే ఆకాశంలో ఇది ఉండాలి! (3)
7. మునగచెట్టు ఆకు!(4)
9. తలలేని రా కండి! (2)
10. పందిలోంచి సున్నా తీసేస్తే? (2)
12. జంతువుల పట్ల దీనితో ప్రవర్తించాలి. (2)

**అడ్డం:**

1. వర్షాకాలంలో పడేవి(3)
3. మేకను తిరగ దిప్పి పిలవండి! (2)
5. పుష్యమాసం తర్వాత యీ మాసం వస్తుంది. (2)
6. “ఆకాశము" మరోలాగా చెప్పండి. (4)
8. బెల్లం, నీళ్లు, మిరియాలు కలిపి చేసేది? (3)
11. బరువులు మోసే జంతువు! (3)
13. యీమెకు ఒకసారి బిందెకు బిగుసరి! (4)

పదరంగం 16 కు సరైన జవాబు →

| | | | | | |
|---|---|---|---|---|---|
| వా | కి | లి | ■ | కా | సు |
| నా | టి | క | ■ | పు | డి |
| కా | కి | ■ | వ | ■ | గా |
| లం | ■ | తో | ట | మా | లి |
| ము | క్కు | ■ | కా | రు | ■ |
| ■ | ■ | ఓ | రు | గ | లు |

ఈసారి సరైన సమాధానం రాసిన వాళ్ళు:

1. కె. ప్రకాశ్, 4వతరగతి, మహీంద్రహైస్కూల్, జహీరాబాద్.
2. జి. తరుణి, 5వతరగతి, గడ్డంనాగేపల్లి, నార్పల.
3. జి. సత్య, 4వతరగతి, పాలపిట్ట సంఘం, చెన్నేకొత్తపల్లి.
4. ఉదయ్, 4వతరగతి, పాలపిట్ట సంఘం, చెన్నేకొత్తపల్లి.

# సమీక్ష

*జూన్ 2012 'టెక్కలి బడి ప్రత్యేక సంచిక' పై ఓ సమీక్ష...*
*నిర్వహణ: శ్రీమతి మాలతీ కృష్ణ, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*




నూట యాభై ఏళ్ళపాటు ఓ ప్రభుత్వ పాఠశాల తన ఉనికిని నిలబెట్టుకుంటూరావటమే కాక, నిత్య చైతన్యంతో, నిరంతరం నేర్చుకుంటూ ఉండటం ఎంతో గొప్పగా ఉంది. అది టెక్కలి బడికే కాదు- తెలుగువాళ్ళందరికీ గర్వ కారణమే. అటువంటి బడి పక్షాన ప్రత్యేక సంచిక రావటమూ గొప్ప సంతోషమే.

కథలు వ్రాసిన పెద్దలందరికీ మృదు గంభీరశైలిలో కథ చెప్పగల నేర్పు ఉందని తెలుస్తోంది. వరాలిచ్చే దేవతలు దురాశ, బద్ధకంలాంటివాటిని మాత్రం సహించరని, బుద్ధి చెబుతారనీ మన జానపద కథలు చెబుతాయి. అలాంటి కోవకి చెందిన 'పాత కుండ'ని సుమిత్రాదేవిగారు చక్కగా అనువదించారు.

అశోకుడి వైరాగ్యం గురించిన 'బౌద్ధకథ'ని సందర్భానికి చక్కగా అమరిపోయేలా వ్రాశారు సత్యనారాయణగారు.

'నడిచే గ్రంధాలయం' మంచి అంశం. దానిపై కథ అల్లటం మంచి ప్రయత్నం. కానీ కథా పరంగా ఇంకొంత ఆలోచన పెట్టి ఉంటే బాగుండేదనిపించింది. కథలో వాక్య ప్రయోగాల్లో అక్కడక్కడా దోషాలు కూడా కనబడ్డాయి.."ప్రజలందరిచేత విరివిగా పుస్తకాలు చదవాలని.."లాంటివి.

సుబ్బారావుగారి 'ఫలప్రదం'లో కథాంశం, శైలీ రెండూ బాగున్నాయి.

'ప్రజల తల్లి' చదివే ముందు దాన్ని వ్రాసిందెవరో చూడలేదు. అది ఎవరో టీచరుగారు వ్రాసి ఉంటారనుకున్నాను. తీరా దాన్ని రాసింది హేమలత, 8 వతరగతి అని చూసి ఆశ్చర్యపోయాను.

విద్యార్థులు తమకు దీటుగా వుండటం గురువుల విజయమే!

అందరినీ కలుపుకు పోవాలి; అందరితో కలిసి పోవాలన్న విలువైన విషయాన్ని భూపతి మంచి కథ ద్వారా చెప్పాడు. కానీ ఊరివాళ్ళు పాపం ఆ పిల్లాడిని పైకి ఏమీ అనలేదు కదా; మరి వాళ్ళమీద ఎందుకంత కోపం పెరిగిపోయిందో, వాడికి!

'మంచి స్నేహితులు' నిజంగానే నవీన్ చేసిన పంచతంత్ర కథల 'కొలేజ్' నక్కలాగా ఉంది.

'చేపలు-కప్పలు' అచ్చం మనుషుల్లాగే పోట్లాడుకున్నాయి. ముందు వదిలేసిన చేపలు తీరా కప్పతల్లి 'మీ జోలికి రాములే' అని చెప్పాక శిక్షకోసం పట్టుపట్టాయెందుకో?! పోట్లాటలంటే అలానే ఉంటాయి కాబోలు. చటుక్కున తిరిగి ఒకళ్ళనొకళ్ళు క్షమించేసుకోవటం బావుంది కదూ!

పద్మారావు వ్రాసిన 'విలువైన స్నేహం' పంచతంత్ర కథలకు ఏమీ తీసిపోకుండా ఉంది. పేర్లు కూడా గిసర-కర్ణిక అని చక్కగా పెట్టాడు. కానీ ఒక్కటే అర్థం కాలేదు- గుంటలో పడితే పైకి రాలేని నక్క, మరి జింకని గుంటలో పడేసి తిందామన్న ఆలోచన ఎలా చేసిందో! నక్కకి బుర్ర బొత్తిగా తక్కువనుకుంట.

క్రాంతి తన పేరు పెట్టుకొని వ్రాసిన 'పాలభూతం' వెరైటీగా ఉంది. 'గాలికి కొట్టుకు పోయినట్లు రివ్వున దూసుకుపోయింది' లాంటి వర్ణనలు కళ్ళకు కట్టినట్లున్నాయి.

చివర్న చెప్పుకున్నా 'పేపర్ బోయ్ 'అన్నిటికంటే ముఖ్యంగా చెప్పుకోవాల్సింది. చంద్రశేఖర్‌లాంటి అబ్బాయి పేపర్ బోయ్ అవ్వాల్సిన కారణాలు ఏవైనా, అతని అనుభవం మాత్రం విలువైనది-గొప్పది. తన అనుభవాలని మనతోపంచుకున్న తీరు అతని పరిణతిని తెలియజేస్తుంది. కష్టాన్నీ సంతోషాన్నీ విడివిడిగా చూస్తూ, ఏ ఒక్కటీ రెండోదాన్ని మింగెయ్యకుండా చూసుకునే నేర్పు పిల్లల్లో వున్నంత పెద్దవాళ్లలో ఉండదేమో!

మొత్తానికి, 'టెక్కలి ప్రత్యేక సంచిక'ఇచ్చినందుకు కొత్తపల్లివారికీ, టెక్కలి విద్యార్థి-అధ్యాపక బృందానికీ, చిత్రకారులకూ అందరికీ అభినందనలు.

మంచి పుస్తకం:

# అనగా అనగా

"పిల్లల కథల సేకరణ సాధారణ విషయం కాదు, ఎన్నో పుస్తకాలు, పాత పత్రికలూ చూడాలి. గ్రంథాలయాలు శోధించాలి, ఎంతో ఓపిక , తీరిక ఉండాలి. ప్రయాస పడ్డాను, అయినా సంతృప్తి కాలేదు, ఎంతో మిగిలి ఉండి పోయింది. వందకథలు సేకరించాలకున్నాను, యాభైఐదు కథలు మట్టుకే సేకరించగల్గేను. అక్కడ ఇక్కడ ఎన్నో మంచి కథలు వుండిపోయాయి. గొప్పరచయితల, ఎంతో గొప్పవైన కథలూ ఎన్నో వుండవచ్చు.. అజ్ఞాత రచయితల కమ్మనైన పాత కథలు ఎన్నో ఉన్నాయి, అవన్నీ సేకరించవలసి వుంది...."

అని రాశారు మసూనా గారు, ముందు మాటలో.

ఎవరెవరి కథలున్నె ఇందులో..? గిడుగు సీతాపతి , వేలూరి శివరామ శాస్త్రి, చింతా దీక్షితులు, న్యాయపతి రాఘవరావు, కామేశ్వరి, ముళ్లపూడి, జంధ్యాల పాపయ్య సాస్త్రి, నండూరి సుబ్బారావు, వాకాటి పాండురంగారావు.. ఇంకెందరు గొప్పవాళ్ల పేర్లు రాయాలి?!

అందరి ఇళ్లలోనూ, లైబ్రరీల్లోనూ ఉండి తీరాల్సినంత అద్భుతమైన చిన్న పుస్తకం! ఇప్పుడు అసలు దొరుకుతుందో లేదో- ఎక్కడ దొరికినా తీసి జాగ్రత్త చేయండి!

**అనగా అనగా**

మండా సూర్యనారాయణ

ఆం.ప్ర. బాలల అకాడమీ(1999)

పబ్లిక్‌గార్డెన్స్,

హైదరాబాదు.

పేజీలు:116

వెల: రూ.6/-



## నిలకడ

"మా వాడికి బొత్తిగా నిలకడ లేదండీ" చెప్పాడు సుబ్బారావు.

"అంటే ఎప్పుడూ ఎగురుతూ ఉంటాడా?" అడిగాను.

"అవునండీ, కాలు ఒక చోట నిలవదు".

"మరి నోరు?" అడిగా.

"అయ్యో! ఆ నోటి గురించి ఏం చెప్పాలి? బడ బడ వాగుతూనే ఉంటుందెప్పుడూ" అన్నాడు.

"ఓహో! మరైతే ఆకలి బాగానే ఉండి ఉంటుంది" అన్నా.

"అమ్మో! మామూలు ఆకలి కాదు. ఎప్పుడూ ఏదో ఒకటి కరకరా నముల్తూనే ఉంటాడు".

"మరి ఆటలు?"

"ఒకటే ఆడతాడు! ఒకసారి దాగుడు మూతలు, ఒకసారి గోలీలు, ఒకసారి కోతికొమ్మచ్చి, ఓసారి ఇంకేదో, ఓసారి ఇంకేదో. ఆడుతూ ఉండమంటే రోజంతా ఆడతాడు" అన్నాడు సుబ్బారావు.

"ఏమైనా వస్తువులు తయారు చేస్తాడా? రిపేర్లు వగైరాలు?"

"బాగా కనుక్కున్నారు సార్! ఎప్పుడూ ఏదో ఒకటి రిపేరు చేస్తూనే ఉంటాడు. కొత్తగా రోబాట్ బొమ్మ కొనిపెడితే రాత్రికల్లా దాన్ని విరిచి ముక్కలు చేసిపెట్టాడు- లోపల వెలిగే బల్బు ఎలా వెలుగుతుందో చూడాలట!"

"మరి మీ బండి స్పీకర్లనీ వదిలిపెట్టి ఉండడు!" అన్నాను నేను.

"నిజంగానే వదల్లేదు మాస్టారూ! దాన్లో ఎక్కడో ఓ మంచి అయస్కాంతం ఉంటుందట. దాన్ని ఇసకలో దొర్లిస్తే చాలా ఇనప రజను వస్తుందట. ఇనప రజనును అట్టమీద పోసి, క్రింద అయస్కాంతాన్ని కదిలిస్తే చాలట- మహాభారత యుద్ధం కళ్ళముందు కనబడుతుందట!"

"ఓహో, మీవాడికి మహాభారత యుద్ధం కూడా తెలుసా?" అడిగాను నేను ముచ్చటపడుతూ.

"అయ్యో, వాడికి ఉన్నంత కథల పిచ్చి మాకు కూడా ఉండదండీ. ఎప్పుడూ 'కథలు-కథలు' అని వేధించుకు తింటాడు. అప్పటికీ వాళ్ళ అవ్వ ఏవేవో కథలు చెబుతూనే ఉంటుంది. మీకు వాడి గురించి అన్నీ తెలిసినట్లే ఉంది- మా వాడికి కొంచెం మంచి బుద్ధులు ఎలా వస్తాయో చెప్పండి కాస్త! ఏమైనా ధ్యానం నేర్పించమంటారా?"

"వాడికేముందిగానీ, ముందు మీకో మాట చెబుతాను-" అన్నాను.

"చెప్పండి"

"ఏం లేదు, మీవాడిని గురించి చింత పడటం మానెయ్యండి. వాడు చాలా చక్కగా ఎదుగుతున్నాడు- ఇప్పుడే ఏమాత్రం నిలకడ తెప్పించకండి వాడికి. ఇంకొంతకాలం ఇట్లాగే సంతోషంగా ఉండనివ్వండి, పర్లేదు!"

---

Edited, typeset and Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph:08559 240222 E-mail: team@kottapalli.in and printed at Mudrica Offcet printers, Vijayawada, Phone:08662579129.